# ప్రభుత్వము






గ్రంథకర్త:

గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం.ఏ.



నమ్మాళ్వారు

౨౧, స్ట్రాటన్ ముత్యాముదలి వీధి,

పోస్టుబాక్సు నెం ౨౪౧, మద్రాసు.

౧౯౩౮

వెల ఆరు అణాలు
లేక ఒక షిల్లింగు

# విషయసూచిక



రాజకీయములు ౫

# ప్రభుత్వము

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

ప్రకటనకర్తలు :

నమ్మాళ్వార్స

పోస్టు బాక్సు ౨౫౧

మద్రాసు

౧౯౩౭

వెల ఎనిమిది అణాలు
లేక ఒక షిల్లింగు



# ప్రభుత్వము



౧

## ప్రభుత్వమనగా నేమి?

ప్రభుత్వమనునది నిజముగా బ్రహ్మవిద్యగాదు. కవిత్వము, చిత్రలేఖనము, చిత్రలేపనము ఇత్యాదివిద్యల వంటిదైనను గాదు. వీనినన్నిటినిగాని, కొన్నిటినిగాని, ఒక్కటినిగాని సాధించుటకు పూర్వజన్మవాసన యవసరమందురు. ప్రభుత్వ మనుదానిని సాధించుటకు అంత పూర్వజన్మవాసనయు నవసరము గాదు.

ఇదియేమిది? ప్రభుత్వ మనిన ఇంతచులకనగా పలుకుచున్నారే యని చదువరు లాశ్చర్యపడవచ్చును. అట్లచ్చెరువంద బనిలేదు. కుటుంబములో ఇంటిపెద్ద చేయునట్టిపనిని ప్రభుత్వమనుపని అనుకరించును. అందువలన అది యంతకష్టసాధ్యము కాదనుచున్నాము.

ఒక్కనిముస మాలోచింతము. ఇంటిపెద్ద చేయునట్టి పనియేమి? ఇంటిలోనికి ఇతరులు దూరి దోచుకొని పోకుండ ఇంటిని కాపాడుకొనుచున్నాడు. ఇంటిలో కుటుంబమునకు కావలసిన భోజనాదివసతులకు తగినసదుపాయములకయి వస్తుసముదాయమును సేకరించుచున్నాడు. కుటుంబము

లోని వేరు వేరు జనులకు—అన్నకు దమ్మునికి, అక్కకు చెల్లెలికి, బావకు మరదికి, మామకు అల్లునికి—వివాదములు వచ్చినప్పుడు ఆవివాదములను తీర్చుచున్నాడు. చిన్నపిల్లలింటిలో ఉన్నయెడల వారికి గావలసినచదువు సంధ్యలకు తగిన యేర్పాటులు చేయుచున్నాడు. ఉచితజ్ఞుడగు ఉపాధ్యాయునో లేకున్న సరియైన విద్యాలయమునో వెదకికొని లేదా స్థాపింపించి వారికి విద్యవచ్చునట్లు చేయుచున్నాడు. మరి ఇంటిలోనివారికి భోజనాదికములు నిచ్చుచున్నాడు. గుడ్డల నిచ్చుచున్నాడు. వివాహాదినిత్యజీవన విషయములన్నియు సంపాదించుచున్నాడు. ఇంటిలోనివారలకు ఎవ్వరకైనను ఆరోగ్యముతప్పి రోగములు వచ్చినప్పుడు వారికి తగిన వైద్యసహాయమును సంపాదించుచున్నాడు. ఇల్లు శుభ్రముగా నుంచుటకు ఇంటిలో రాత్రులు దీపములు మొదలైనవి పెట్టుటకు అన్నివిధములైన ఏర్పాటులును చేయుచున్నాడు.

ఇట్టి ఏర్పాటులన్నియును బహుసామాన్యులైన గృహస్థులు చేసికొనుచుండుట ప్రపంచమున ప్రతి దినానుభవముగా నున్నది. మన దేశములో నిన్న నేటి దనుక గూడ ఇంతటి సంపూర్ణమైన ఏర్పాటులో, ఇందులో కొన్ని కొన్నియో, ఒక్కొక్క గ్రామమునకు ఒక్కొక్క తెగకు సంబంధించి నడచివచ్చినవి.

నశించీ నశింపకయుండు గ్రామసంస్థలవై పొక్క పర్యాయము దృష్టిమరల్చి చూడుడు. ఒక్కొక్క గ్రామములోను, కొన్నికొన్ని ప్రాంతములలో, నేటికిని సమష్టి ఆదాయ మున్నది. ఆదాయ మిప్పుడు విశేషముగా ఏజాతిర

లకో కర్చగుచుండుట నిజమేకాని ఇంతకు కొంచెము పూర్వము అది గ్రామములమొత్తము మేలునకు వినియోగపడుచుండె ననుట నిక్కువము. ౧౦ ఏండ్లకు పై బడనికాలమున సమష్టిమీద గ్రామమునకు కావలసిన బావులు మొదలైనజలాధారములు బాగుచేయుటయు, ఉపాధ్యాయులను నియమించుటయు, బాటలు చక్కబెట్టుటయు, మున్నగుకార్యములు గ్రామస్థులే జరుపుకొనుట కన్నులార చూచినవారు చాలమందికలరు. ఇక వివాదముల తీర్పు విషయమై వ్రాయనక్కరయే లేదు. గ్రామసీమలలో నివసించువారి కందరికిని అంతయునశించిన నేటి కాలమునందును 'పంచాయతు' లను శబ్దము కడుంగడు పరిచితముగా నున్నది. ఎంతటి నిమ్నజాతులలోను వివాదములను తీర్చికొను శక్తి మన దేశమున పరంపరాగతముగ వచ్చియున్నదనుట మన ప్రజ కంతటికిని తెల్లముగా తెలిసిన సంగతియే. కొంతకాలముక్రిందట మద్రాసునగరము నందు తోటిపాకీవారలందరును సంఘముగా నేర్పడుట సంభవించినది. అందులో కొందరొకయేర్పాటు చేసికొనిరి. తమలో తమకు కలుగు వివాదములను బయటికి తీసికొని పోవరాదనుకొనినారు. పంచాయతిని నియమించికొనినారు. తీర్పులు చెప్పికొన్నారు. ఆతీర్పులమూలకముగను సంఘమునకు కొద్దిగా ద్రవ్యము చేరినది.

ఇక ప్రాచీనగ్రామసంస్థల ఏర్పాటు లాలోచింతమా మన దేశములోనుండినంత యౌత్కృష్ట్యము మరి యే దేశములోను నుండినది కాదు. దానినంతయు నిట వివరించుటకురాదు. అది స్థానికస్వపరిపాలనమను గ్రంథ

మునకు జేరినది. కాని యొక్కమాట మాత్రము ఇక్కడ వ్రాయవలసి యున్నది. మనగ్రామములలో అన్నివిధము లగు ఏర్పాటులును గ్రామస్థులచేతులలోనే యుండి, వారే కుటుంబములోని ఇంటిపెద్దవలె గ్రామపుపెద్దలను నియమించుకొని పనులు నెరవేర్చుకొనుచుండిరనుట నిజము.

గ్రామముపై బడుటకు 'బందిపోటు' వచ్చుచున్న దని వినినయెడల గ్రామస్థులలో పటుత్వముగలవారందరును, ఆయుధపాణులై బయలుదేరి గ్రామమును కాపాడుకొనుచుండిరి. గ్రామములో విద్యాలయము జరుగవలయుననిన గ్రామస్థు లందరును బడిపంతులకు సంవత్సరగ్రాసము కల్పించి అతనిని పోషించుచుండిరి. గ్రామములో బాటలు వేసికొనవలసియుండిన తెలకొకబండిరాళ్లు త్రోలి పని జరుపుకొనుచుండిరి. గ్రామమునకు కావలసిన భోజనాదివసతులనిర్వహణమునకు, గ్రామమునకు సంబంధించిన వ్యవసాయమునకు, నేతపనికి, కమ్మరమునకు, కుమ్మరమునకు, వడ్రంగమునకు ఇత్యాదుల కన్నింటికిని ఏర్పాటులుండెను. గ్రామములో ఏదైనను కలరా మున్నగువ్యాధులు కాన్పించినచో ఆయా గ్రామము వారలనమ్మకముల, విశ్వాసముల ననుసరించి ప్రతీకారములు చేయుటయు గ్రామవాసులందరి సమష్టిప్రయత్నము మీదనే జరుగుచుండినది.*

---

* ఇట్టిపనిలో విశేషభాగము జరుగుటకు వీలుచేయవలయుననను నుద్దేశముతోనే ఇటీవల మనకోస్తాలో 'పంచాయతు'ల నిర్మాణమునకును, నిర్వహణమునకును చట్టమేర్పరచి ఇప్పుడాచట్టమును లోకలుబోర్డులశాసనముతో నైక్యపరచి యున్నారు. కొన్ని

ఈరీతిగా మన దేశములో కుటుంబజీవనము, గ్రామ జీవనము అను నీరెండును పరిపూర్ణమైన వికాసముతో విజృంభించియుండినందుననే, మనదేశ మనాదికాలము నుండి ఉత్తమసామ్రాజ్యముల కునికిపట్టై శ్రీరాముడు, చంద్రగుప్తుడు, అశోకుడు, విక్రమార్కుడు, పృథ్వీరాజు, షర్షా, అక్బరు, శివాజీ, శ్రీకృష్ణదేవరాయలు ఇత్యాది మహాచక్రవర్తులకు నిలయమై లోకమునకు సర్వవిధము లగు జ్ఞానమును దానముచేయు మహామాతయై తనరార గల్గినది.

ఇంటికి ఇంటిపెద్దలును, గ్రామమునకు గ్రామపు పెద్దలును ఏయేపనులను నెరవేర్చవలసియున్నారో, నెర వేర్చుచుండినారో అట్టిపనులనే తగినవారు దేశమంతటి కిని నెరవేర్చుటయే 'ప్రభుత్వము' అందురు.

దేశములను పాలించు ప్రభుత్వములవారు చేయు నట్టి కర్మలెవ్వియో గమనింతము.

(౧) దేశమునకు తగిన భూసైన్యమును, నావికా సైన్యమును, వైమానికసైన్యమును స్థాపించి ఇతరులు పైబడివచ్చి దేశమును దోచుకొనిపోకుండ కాపాడుట మొదటిపని.

(౨) తగిన పోలీసుసిబ్బంది, న్యాయస్థానములు

---

కొన్ని జిల్లాలలో ముఖ్యముగా గుంటూరు, గోదావరులు, సేలము, ఉత్తరార్కాటులలో నూర్లకొలది పంచాయతులు చక్కగ పని చేయుచున్నవి. కాంగ్రెసుప్రభుత్వము ఏర్పడినపిదప మరల గ్రామవ్యవహారము లన్నిటిని పంచాయతుల పరము చేయవలెనని వారు ప్రయత్నించుచున్నారు.

ఇత్యాదులను నియమించి, దేశములో నివసించునట్టి ప్రజలలో కలుగు పరస్పరమగు వివాదములను దీర్చుచు, పోట్లాటలను ఆపుచు శాంతి నెలకొల్పి దేశజీవనము సావధానముగా, ధర్మబద్ధముగా నడుచునట్లు చేయుట రెండవపని.

ఈరెండుకర్మలే 'ప్రభుత్వము' అను అధికారము నొసట నీశ్వరుడు వ్రాసినాడను సిద్ధాంతము పాశ్చాత్య భూములలో బహుకాల మంగీకృతమై యుండినది. రాజులు నిరంకుశులుగా నున్నన్నిదినములు, అధికారవర్గములు నిరంకుశములుగా నున్నన్నిదినములు, ప్రజలకు నోరు లేనంత కాలము ఈసిద్ధాంతము అవసరమైయుండినది. దేశములోని వృత్తులను అభివృద్ధి చేయునట్టి పనియు, గనులను త్రవ్వి లాభము సంపాదించుపనియు, ఇటువంటి పనులు పెట్టినయెడల రాజులును, నిరంకుశులును తమబలమును హెచ్చించుకొనుటకే ఈయధికారములను వినియోగించు కొందురు. విద్యావ్యాపనాధికారము వారికి నుండెనేని సామాన్యప్రజ తమకు నెట్లంకితులగుదురాయని ఆలోచించి తదనుకూలమగు విధానమునే నెలకొల్పుట వారికి స్వాభావికమగును. అధికారములు ఒనగూడినట్లెల్లను నిరంకుశప్రభువులును, అధికారులును ఈవిధముగా తమ తమబలమును పెంచుకొన జూచుట తప్పని ఫలము. కాబట్టి నిరంకుశపరిపాలనపద్ధతులు ప్రబలినంత కాలమును పాశ్చాత్యభూములలో ప్రజలు ప్రభుత్వముననుండిన రాజులకును అధికారవర్గములకును ఇట్టి అధికాధికారములను ఇచ్చుటకు అంగీకరించుచుండలేదు. ఇట్టి అధికారములు

అట్టి నిరంకుశుల అధీనమున నున్నప్పుడు ఏవిధముగా నైనను తాము వానిని స్వాధీనపరచుకొనుచు వచ్చిరి. అయిన నేటిదినము పాశ్చాత్యభూములలోను, ప్రాచ్యభూములలోను ప్రజాసత్తాకములు ప్రబలి ప్రజాస్వాతంత్ర్యము స్థాపితమైయున్నది. కాబట్టి ప్రజలు పూర్వము మనగ్రామములలో సమష్టిమీద నెన్నికార్యములు జరుపుచుండిరో అన్నికార్యములు దేశమంతటికిని సమష్టిమీద ప్రభుత్వము వారు జరుపవలయునని కోరుచున్నారు. అంతేకాదు. దేశమునందలి 'గనులు' ఇత్యాదులు ప్రత్యేకముగా ఒక్కరి స్వాధీనమున నుండరాదనియును ప్రభుత్వముల వారే స్వాధీనముచేసికొని పరిపాలించి అందువలని లాభమును ప్రజలందరకును అందజేయవలయుననియు అభిప్రాయపడుచున్నారు.*

కాబట్టి నేడు 'ప్రభుత్వము' అను అధికారము వారు చేయవలసిన కర్మలు

(౧) బయటి శత్రువులనుండి దేశమును సంరక్షించుటగాక,

(౨) పరస్పరవివాదములనుండి ప్రజలను సంరక్షించుటగాక,

(3) దేశమునకు వలయు విద్యావిధానముల నేర్పరచుటగాక,

---

* రుష్యావంటి యుద్దండరాష్ట్రములలో వ్యక్తిగతమగు ఆస్తియే యుండరాదనియు ప్రభుత్వమే సర్వవిధములయిన ఆస్తిని పరిపాలించి ప్రజలకు వారివారి పనినిబట్టి అవసరములనుబట్టి జీతము బత్తెము 'లిచ్చుచు బడిపిల్లలచదువులు ఇత్యాదులన్నియు సమష్టి సంస్థలలో జరుపజూచుచున్నారు.

(౧) దేశమునందలి వ్యవసాయవాణిజ్యములను, పరిశ్రమలను పెంపొందించి దేశాదాయమార్గములను అభివృద్ధిచేయుట

(౨) దేశమునకు వలయు వైద్యసహాయాదికముల నమర్చుట

(3) రైళ్లు, రోడ్డులు, వంతెనలు, విమానములు మున్నగునవి కట్టించి రాకపోకలకు ననుకూలములు కల్పించుట

(౪) బ్యాంకులు, విదేశములతోటి ఆర్థికసంబంధములు ఇత్యాదులు కల్పించి ప్రజలకు ఆర్థికానుకూలములను పొసగించుట

(౫) తపాలా, తంత్రీసమాచారములు ఇత్యాదులేర్పరచి ప్రజలకు సహాయపడుట

మొదలగు ప్రజాసౌకర్యనిర్మాణమునకు సంబంధించిన ధర్మములు క్రమక్రమముగా నేర్పడినవి. ఏర్పడుచున్నవి.

నిజమునకు ఈ కాలమున ఒకవైపున ప్రతిగొప్ప రాష్ట్రమును మహాఘోరయుద్ధమునకు సిద్ధపడుచున్నట్లు అన్ని బలములను పెంచుకొనుచున్నను అన్ని రాష్ట్రముల వారును తాము లోకశాంతికిగానే యిట్టిపని చేయుచున్నామని ప్రకటించుకొనుచున్నారు. ప్రపంచసంగ్రామానంతరము 'లీగ్ అఫ్ నేషన్సు' అను సర్వరాజ్యసమితి యేర్పడి ఆయుధవిసర్జనసమావేశములు జరిపి లోకశాంతిని సమకూర్చవలెనని ప్రయత్నించినది. ప్రపంచములోని సర్వప్రజలకును సంబంధించిన ఆరోగ్య, వైజ్ఞానిక, ఆర్థిక విష

యములలో కొంత పనిచేసినది. స్వల్పరాష్ట్రములపైకి గొప్పరాష్ట్రములు లంఘించి బలహీనులను నశింపజేయకుండ కాపాడవలెనను ప్రయత్నమున ఇటలీ, జపాను, జర్మనీల సామ్రాజ్యాకాంక్షల నెదుర్కొనలేక భగ్నమయినది. సమితిలో ప్రధానరాష్ట్రములగు ఇంగ్లండు, ఫ్రాంసులు సామ్రాజ్యతత్త్వమునకు పుట్టినిండ్లగుటచేత సర్వరాష్ట్రసమితి ఫలవంతము కాలేకపోయినదని తజ్ఞుల యభిప్రాయము. అందుచేత ఏరాష్ట్రమున కారాష్ట్రము ప్రజాసౌకర్యసంబంధములగు సర్వధర్మములను నిర్వహించుచు ప్రాతనాటి దేశసంరక్షణకార్యక్రమమునుగూడ నాటికంటె నేడెక్కువగా తీర్చుకొనవలసినవి యయినవి. ముందు పరిణామ మెట్లుండునో చూడదగును.

పైన ఇదివరకు వివరించిన ఇంటిపెద్దయొక్కయు గ్రామముపెద్దలయొక్కయు కార్యక్రమముతో ప్రభుత్వము అనునట్టి అధికారముయొక్క కార్యక్రమమును పోల్చిచూచినయెడల రెండును వ్యాప్తిభేదమాత్రముతో ఒక్కటియేయనుట యెట్టివారికిని అర్థము కాకపోదు. కాబట్టి ప్రభుత్వము అను అధికారనిర్వహణము సామాన్యమగు విషయమేకాని ఏదో దుస్సాధ్యమగు పనికాదని వ్రాసితిమి. అట్టి సామాన్యవిషయము అయినందువలననే లోకములో నాగరకములేని అనేకరాష్ట్రములుకూడ స్వయంపరిపాలితములై యున్నవి.

ప్రభుత్వమను నధికారము సామాన్యవిషయమే యైనను బహుకాలముగా లోకములోని భిన్నజాతులు దీనిని నెరవేర్చుకొనుచు వచ్చియుండుటచేత, భిన్నభిన్న

ప్రదేశములలో వేర్వేరుకాలములలో నియ్యది భిన్నభిన్న రూపములుగా వేర్వేరుఛాయలుగా పొడసూపినది. అందుచేత నేటిపరిస్థితులలో ప్రభుత్వము అను అధికారము నడుచునట్టి పథము నెఱింగినంగాని అందరితో సమానముగా మనమును ప్రపంచచరిత్రమున పాల్గొనజాలము. ప్రపంచమున నన్నిప్రాంతములయందును పాశ్చాత్యజాతుల ప్రాబల్యమువలన కొంచె మించుమించుగా నొకేవిధమగు ప్రభుత్వస్వరూపము ఏర్పడునట్టి మార్గము దోచియున్నది. ఆమార్గమును అనుసరించి నేటిదినము మనదేశములోను స్వరాజ్యమును నెలకొల్పుటకు ఉద్యోగములు జరుగుచున్నవి. ఆమార్గము లేవియో వివరించుట ఆకారణముచేత నవసరము.

పాశ్చాత్యజాతుల ప్రాబల్యముచేత ప్రభుత్వాధికారము ఒక్కరీతిని నేర్పడ నారంభించినది యనుటచేత ఆ యాకారమంతయు మనకు క్రొత్తయనికాని మనదేశమున నట్టియాకారమే యుండలేదని కాని తలంప రాదు. మనదేశమునందు ప్రాచీనకాలములో వ్యాపించియుండిన సంస్థలు నేటిపాశ్చాత్యరాజకీయసంస్థల పితామహప్రపితామహస్థానమునుండి మన జీవితసిద్ధాంతములమీద నాధారపడి యుండినందున నింతకన్నను నెన్నియో మడుంగులు ప్రజాశాంతికి అనుకూలతరములుగా నుండెననుట నిక్కవము. వానిసూక్ష్మవివరణ మంతయును ప్రస్తుతవిషయముగాదు.





౨

# మూడు విధములు

నేడు అంగీకృతమైయుండు రాజకీయసిద్ధాంతాను గుణముగా ప్రభుత్వమను నధికారము మూడువిధము లుగా పరిస్ఫుట మగుచున్నది.

## శాసననిర్మాణము

(౧) దీనినే తేటతెనుగున చట్టములు చేయుట యందురు. వేలకొలది ప్రజలకు సంబంధించిన పనులు చేయవలసియున్నప్పుడు ఆలోచనచేయకుండ పనిచేయ రాదుగదా! ఆ యాలోచనమైనను నిమేషనిమేషమున కును మారుచుండు నట్టిదిగా నుండరాదుగదా! బాగుగా ఆలోచనచేసి మనము పద్ధతిని మార్చుకొనువరకును ఈ విషయమై ఈవిధముగా మనదేశములో పనులు జరుగు చుండవలసినది అని తగిన పదిమందిచేరి నిశ్చయము చేసి కొనుటకే చట్టముచేయుట యని పేరు. అట్టిసభలకే శాసననిర్మాణసభలనియు పేరు. ఆయధికారమునకే శాసన నిర్మాణాధికార మని పేరు.

## శాసనవివరణము

(౨) ప్రజాసమూహమునకు సంబంధించిన కట్టు దిట్టము దినదినము మారుచునుండరాదని చెప్పితిమి. సంవ త్సరము సంవత్సరము మారుచుండవచ్చునా యని ప్రశ్నించికొందము. ఇదియు పొసగునట్టి పనికాదు. తర ములు తరములు యుగములు యుగములుగా చట్టములు అమలులోనున్నవి. మనదేశములో ఇప్పటికిని మనుధర్మ

శాస్త్రము, పరాశరస్మృతి యిత్యాదులు ఆధారములుగా నున్నవి. వీనికి వ్యతిరేకముగా నడచుట యనిన మహాపాపమని తలంచునట్టివారును ఇంకను కోటానుకోటులున్నారు. మితాక్షరి, దాయభాగన్యాయములు ఏనాడో ఏర్పడినవి నేటికిని ఉపకరించుచున్నవి. ఈరీతిగా శాసనములకు చిరాయువు కలిగియుండుట ఒక్క మన దేశములోనే కాదు. మనకు ప్రభువులుగానుండు ఆంగ్లేయుల దేశచరిత్రమును ఆలోచించినను, వారలు ఏ పదిమూడవశతాబ్దపు శాసనమునో మాటిమాటికి తమసర్వస్వాతంత్ర్యములకును ఆధారముచేసికొని మాట్లాడుట గమనింపనగును. ఇట్లనుటచేత శాసనములు మారుచుండలేదని చెప్పుటగాదు. సంవత్సరము సంవత్సరము మారునట్టి శాసనములును నేటిదినము గలవు. * కాని మొత్తముమీద శాసనములు బహుకాలము స్థిరత్వముగలవై యుండుననుట నిక్కవము. అట్లు స్థిరత్వముగలవై యుండునవియే శాసననామమున కర్హములనియు జెప్పవచ్చును. ఎందువలన నన సంఘము దినదినాభివృద్ధి నందునట్టి వ్యక్తియైనను పూర్వసంబంధములను దినదినమును త్రెంచుకొనునట్టిదిగాదు. ఈనాటిజీవితమునకు నిన్నటిజీవితమును బునాదిచేసికొని, ఈనాటి జీవితమును నిన్నటి జీవితముతో సమన్వయము చేసికొని, రేపటిజీవితమునకు ఈనాటిజీవితమును ఆధారము కావించుకొనుచున్నది. ఇట్టి యనంతస్వరూపము సంఘ

---

* ప్రపంచరాష్ట్రముల నగ్రస్థానము నాక్రమించినదని పేరు గనిన అమెరికాసంయుక్తరాష్ట్రము సంవత్సరమునకు ౨౫౦౦ శాసనములు చేయుచున్నదట.

మునకు కలదగుటంజేసి సంఘమునకు సంబంధించిన కట్టు దిట్టములకును స్థిరత్వము కొంతవరకు అవసరమగుచున్నది. ఆలోచించి ఈ కట్టుదిట్టములను అమర్చిపెట్టునట్టి వారు శాసనకర్తలు. మనదేశమునందు పూర్వ మిట్టిపనిని ఋషులు చేసిరందురు. నేటిదిన మెల్లచోటులలోను శాసనసభలలో చేరి శాసనసభ్యులీకార్యమును నెరవేర్చు చున్నారు.

అయిన ఈ స్థిరత్వము అచలముగాదు. మానవుడు బుద్ధివికాసము కలవాడు. తనప్రతిభచేత నిమేషనిమేష మును ఉత్తర ఉత్తమస్థితులకు ప్రాకుచుండు స్వభావము కలవాడు. కాబట్టి ఏనాడో చేయబడిన శాసనమునైనను ప్రస్తుతోపయోగమునకు సరిపరచుకొనవలసినవాడు. అందుచేత శాసనగర్భమున నిమిడియుండు పదజాల మొక టియే యైనను కాలానుగుణముగా అర్థ మొక కొంతవిభేద పడుట కవకాశముకలదు. లిఖితమగు పదముల కొక్కటే యర్థ మెల్లప్పుడును నుండదు. ఏసందర్భమున మాటల నుపయోగింపవలసి యుండునో ఆసందర్భము ననుసరించి మాటలయర్థము మారవచ్చుననుట యెల్ల రెరింగినవిష యమే. 'ఏమయ్యా' అనునీరెండు పదములయర్థ మాలో చింతము. ముఖవికారమేమియు లేక వీనిని నుపయో గించునెడల సంగతియేమి అని యడిగి నట్లగును. ఈపద ములనే కుటిలంపుచిరునగవుతో నుపయోగింతుమేని 'నీవు చేసిన యపచారము నేనెరుగుదును. ఏమిసమాధానమిచ్చె దవు? తెలుపు'మని బెదరించినట్లగును. ఈపదములనే కీల్గొం తుతో మొగము తేలవైచి పలికినయెడల 'అయ్యో, నే

నేమియు సహాయములేనివాడనై యున్నాడనే, నన్నేల ఇట్లు పీడించెదవు'అను నర్థమిచ్చును. ఇంతేకాదు. పదములపొందికకూడ బుద్ధివికాసము కలవారలకు వేర్వేరు అర్థములను స్ఫురింపజేయుచుండును. స్వపక్షమును సమర్థించుకొనుట మానవునకు నైజగుణము. అందుచేత శాసనము చేయబడిన పిదప దానిలోని పదజాలమును తనకు అనుకూలపడునట్లు వినియోగింప జూచుకొనుట మానవునకు లక్షణమైనది. కాబట్టి శాసనము పుట్టినతోడనే దానికి నర్థముచెప్పునట్టి యధికారియు నేర్పడవలసి వచ్చినాడు. ఒక్క చిన్న దృష్టాంతము. మన దేశపు శిక్షాస్మృతిలో 'దొంగతనము' అనునది నిర్వచింపబడినది. పరుని వస్తువును అతనియనుమతిలేక స్వీకరించుట దొంగతనము అనియున్నది. ఒక్క ఇంటిలో ఇద్దరన్నదమ్ము లున్నారు. అచ్చట ఒక్క వస్తువుకలదు. అందుకు సంబంధించి ఎవ్వరు ఎప్పుడు పరుడగును? ఈ వివరణ శాసనములలో లేదు. ఇదేవిధముగా 'అనుమతి'యను సంగతియు సందిగ్ధములకు కారణము. తల యొకప్రక్కకు నూచిన సమ్మతియగును. రెండవప్రక్కకు త్రిప్పిన సమ్మతి లేకపోవచ్చును. ఈవివరణము శాసనములో లేదు. ఈవివరణముల నిర్ణయము చేయుటకు అధికారి అవసరముగదా! ఆయధికారమే శాసనవివరణాధికారము, న్యాయవిమర్శనాధికారము అనుపేర్ల బరగుచున్నది. అప్పటికప్పుడు సందర్భముల నన్నిటిని విని శాసనములకర్థము నిర్ణయించి తీర్పుచెప్పుట కేర్పడినవారినే మనము మేజస్ట్రీటులని, మునసబులని, జడ్జీలని, పంచాయతులని, కోర్టులని వ్యవహరించుచున్నాము.

## శాసననిర్వహణము

(3) శాసనములు చేయుట యొకపని; అర్థము చెప్పుట యొకపని; కాగా, వానిని కార్యక్రమమున పెట్టుట యనునది మరియొక పనికలదు. ఏర్పాటులు చేయుట యేల? నడిపించుటకేకదా! నడిపింపకుండునెడల ఏర్పాటులు చేయనేల? కాబట్టి సంఘమున కంతటికిని కావలసిన ఏర్పాటులను చేయునట్టి యధికారులు వానిని చేసినపిదప అట్టి ఏర్పాటులను నడిపించునట్టి యధికారులు కావలసియుందురు. వారికే లోకములో నేటిదినము 'అధికార' శాఖవారని పేరుపడియున్నది. ఆలోచనలు చెప్పువారు; వ్యాఖ్యానములుచేయువారు ఎంత కుశాగ్రబుద్ధులైనను కార్యము నడుపువారితో సమానమగు పలుకుబడిని వారు సంపాదించుట సులభసాధ్యముకాదు. అందుచేతనే అధికారశాఖ యెల్లప్పుడును ప్రపంచమునపై చేయి కాజూచినది. ప్రజలస్వామ్యములను తనస్వాధీనముననుంచుకొన జూచినది. ప్రజలు తక్కుంగలశాఖలకు ప్రాముఖ్యము కల్పించి అధికారశాఖను వానికి వశముగ చేయ జూచినారు. ఎట్లైన నేమి, ప్రభుత్వమను అధికారమున

(౧) శాసననిర్మాణము
(౨) శాసనవివరణము
(3) శాసననిర్వహణము

అంగములుగా గర్భితములై యున్నవనుట స్పష్టము.



# 3
# మూడు శక్తులు

ఈమూడు శక్తులును ఒక్కటే స్థానమునందు ఏకమైయుండునెడల కలుగునష్టము మిక్కిలి యెక్కువయని యెరింగి లోకము బహుకాలముగా వీనిని వేరుపరచియుంచుటకు సర్వప్రయత్నములును చేసినది. అయిన నెచ్చటను సంపూర్ణముగా వేరుపరచుటకు రాలేదనుటయు నిక్కవమే. మొదటినుండియు లోకములో నిరంకుశ ప్రభువులు దేశములను వశముచేసికొని సర్వాధికారములును తమచేతులలో నుంచుకొని పరిపాలించుచు తమ దివ్యచిత్తమునకు వచ్చినదియే శాసనముగా ప్రవర్తించుచు వచ్చినందున పై ప్రయత్నము జరుగవలసివచ్చినది.

చిన్న ఉదాహరణమును గొందము. సైనికాధికారమునకుపోలిన మరియొక నిరంకుశప్రభుత్వపద్ధతి లేనేలేదు. సైనికాధికారప్రభుత్వ మున్నంతకాలము అధికారమున నుండునట్టి సైనికాధికారి నోట నేమాట యుచ్చరించిన నది శాసనము. అత డేయర్థము చెప్పిన నదియే శాసనమునకు నర్థము. అత డేరీతిని శాసనమును అమలులో పెట్టిన నదియే శాసననిర్వహణము. కాబట్టి సైనికాధికార ప్రభుత్వమున నధ్యక్షుడుగానుండు నతడు ప్రభుత్వాంగములును మూడింటిని పూర్తిగా వశముచేసికొని ఇచ్ఛకు వచ్చినమేరకు చరించుచుండును. కొంతకాలముక్రిందట పంజాబులోను, ఇతర ప్రాంతములలోను స్వల్పకాలము సైనికప్రభుత్వము వెలసినదనుమాట మాచదువరు లెరుం

గుదురు. అప్పుడు జరిగిన ఘోరస్థితులును పదేపదే వర్ణితములయియేయున్నవి. గౌరవవంతులగు మానవులను పొట్టమీద ప్రాకించు నంతటి యధికారముకూడ సైనిక ప్రభుత్వాధికారులకు నుండినది యనినచో శాసననిర్మాణ, వివరణ, నిర్వహణాధికారములు మూడును పరిపూర్ణముగ నేకవ్యక్తియందు ఇమిడినచో కలుగు దుర్భరస్థితి యర్థము కాకపోదు.

ఈశక్తుల విభాగము మనపూర్వచరిత్రమున ఎంత వరకు జరిగినది? నే డెంతవరకు కలదు? ముం దెంతవరకు నుండగలదు? అనుప్రశ్నలకు ప్రత్యుత్తరము వ్రాయగడంగినచో నదియే మహాగ్రంథము కావచ్చును. అయిన క్లుప్తముగా సంగతినిగమనించి ముందు విషయమునకు తరల వలసి యున్నాము. సామాన్యముగా పూర్వము మన దేశములో రాజులు నిరంకుశులుగా నుండిరనియు అప్పటికాలమున శాసననిర్మాణము, శాసనవివరణము, శాసననిర్వహణమను విభాగ ముండనే లేదనియు వ్యవహరించుట గలదు. ఇదివరలోనే యీగ్రంథములోనే తెల్లము చేసినవిధమున గ్రామగ్రామమునకు స్వతంత్రజీవనమేర్పడి యుండినదే కాక మనరాజులు నిరంకుశులుగాక, నేటి ఆంగ్లసార్వభౌముని పగిదిని మితాధికారధూర్వహులుగానుండిరనుట, రానురాను చరిత్రకారులు గ్రహించుచున్నారు. ఋషులు శాసనములుచేయ, ప్రజారంజకముగ మంత్రులు వానికర్థముజెప్ప, రాజులు వానిని అమలులో పెట్టుచుండినారు. రాజు శాసననిర్వహణాధికారి తక్క వేరుకాదు. ఇది రామాయణకాలమునకు మున్నే మన భారతభూమి

యందు వ్యాపించియుండిన పద్ధతి. సూక్ష్మవిమర్శ మరి యొకచోట చేయనగును. పాశ్చాత్యభూములలోనో శాసన నిర్మాణ, శాసనవివరణ, శాసననిర్వహణాధికారము లన్నియు కొంతకాలము రాజుల చేతులలోనుండి, తరువాత సామంతులచేతులలోబడి, ప్రజల యొత్తిడిచేత క్రమక్రమముగా వేరుపడి మరల ప్రజాప్రభుత్వములు విరివిగా తల యెత్తిన తరువాత ప్రజాప్రతినిధులలో కేంద్రీకారము నందుచున్నవి. డిక్టేటరులలో ఈ కేంద్రీకరణము విపరీతమై అలజడి కలిగించుచున్నది. శాసననిర్మాణ, వివరణ, నిర్వహణాధికార విభాగమునకు కలిగిన ముఖ్యకారణము అధికారుల నిరంకుశప్రవర్తన. దానిని మట్టుపెట్టి రాజ్యమున ప్రజల యభీష్టము నెరవేరునట్లు చేసికొనుటకు ప్రజాసమూహము రాజులకును, అధికారవర్గములకును శాసననిర్వహణాధికారము మాత్ర ముంచి, తక్కుంగల యధికారములను క్రమక్రమముగా తమకో, అది సాధ్యముకానిచో అధికారవర్గమునకు ప్రత్యక్షముగా లోబడని యట్టి ప్రత్యేకవ్యక్తులకో, చెందజేయ ప్రయత్నించుచు వచ్చినది. మన దేశములోను దేశీయమహాసభ ఏబదియేండ్లుగ శాసనసభ సంపూర్ణముగా ప్రజానువర్తి కావలసినదనియు, అధికారవర్గమువారికి న్యాయవిమర్శన శక్తియుంగూడ నుండరాదనియు—అనగా కలెక్టరులు పోలిన వారికి మేజిస్ట్రీటు అధికార ముండరాదనియు—కోరుటకు కారణమును ఇదియే. బ్రిటిషురాజ్య మిచ్చట స్థాపితమైన పిదప శాసననిర్మాణ, వివరణ, నిర్వహణశక్తులు మూడును అధికారవర్గమునందు కేంద్రీకృతమయి యుండుటచేత

మనరైతులు ఫారెస్టు, డీ. పీ. డబల్యు ఇత్యాదివిషయ
ములలో దుర్భరావస్థ పడవలసివచ్చినది. ఈపరిస్థితియం
తయు నొక్కకాలమున పాశ్చాత్యభూములలో పొడసూపి
నదియే. మన దేశమునందు కాంగ్రెసువారి నిరంతరప్రయ
త్నముచేతను, భారతపుత్రీపుత్రుల యపారత్యాగముచేతను
మనకు నేటిదినము పరగణాలలో నొకవిధమయిన స్వపరి
పాలన యేర్పడి పరగణాలమట్టుకు సర్కారు ఇలాకాల
పయి మనవోట్లచే నేర్పడు మంత్రులకు అధికారము కలిగి
యున్నది. కాని భారతప్రభుత్వము పూర్ణముగా స్వతంత్ర
మగువరకు నిరంకుశచ్ఛాయ విడిచిపోయిన దనుకొనరాదు.
నేటి ఐ. సి. ఎసుల నియామకము, వారితీసివేత, వారి
రక్షణ శిక్షణలు సర్వము మంత్రుల యధీనమైననాడే
మనకు నిజమగు స్వాతంత్ర్యము కలిగినట్లెన్నదగును. ఇది
వరలో సంపూర్ణప్రజాప్రభుత్వము లనుకొనిన జర్మనీ,
ఇటలీ మున్నగు రాష్ట్రములలో శాసననిర్మాణ, నిర్వహ
ణాధికారములు హిట్లరు, ముసోలినీల హస్తగతము
లగుటచేత శాసనవివరణాధికారులనుగూడ లొంగదీసికొని
వారు నేడు 'నియంత'లను క్రొత్తరకపు నిరంకుశాధికా
రులు కాగలిగినారు. అందుచేతనే నేటికిని ఎంతటిప్రజా
ప్రభుత్వములు ప్రబలినను పాశ్చాత్యభూములలో ఉదారు
లైనవారందరును శాసననిర్మాణ, వివరణ, నిర్వహణము
లను వేరువేరుగనే వ్యవహరింప జూచుచున్నారు. శాసన
వివరణ, శాసననిర్వహణాధికారములను కలెక్టరులు
మున్నగు నధికారులలో నేకముగా నుంచరాదనియు, విభ
జింపవలసినదనియు మన దేశమున కాంగ్రెసుమంత్రివర్గపరి

పాలితప్రాంతములలోను ఆందోళన జరుగుచున్నది.

కాబట్టి ఈమూడధికారముల స్వభావస్వరూపములు వెన్వెంటనే వర్ణింప దగియున్నది.



## ౪

# శాసననిర్మాణస్వరూపము

కార్యనిర్వాహకుల నిరంకుశత్వమును అణంచునట్టి ప్రథమసాధనము శాసననిర్మాణము. ఈయీవిధముగా గార్యములు జరుగవలసినది యని యొకనిర్ణయమేర్పడిన తరువాత కార్యనిర్వాహకులు మట్టుమీరి ప్రవర్తించుట సులభసాధ్యము కాదు. అట్టినిర్ణయము ఏర్పరచునట్టిశక్తి ప్రజలకు పూర్తిగా కలిగినయెడల అధికారు లెంతనిరంకుశులైనను, "శాసనవిరోధము చేయుచున్నారమే, ప్రజలకోపాగ్ని ప్రజ్వరిల్లునే, లోకాపవాద వ్యాపించునే," యని యాలోచించి ప్రవర్తింపవలసి యుందురు. ఇంతటి యంకుశముగా నీశక్తి యుపకరింప గల్గుటనుజేసి యెల్ల దేశములలోను ప్రజలు దొలుదొలుత ఈశక్తినే సాధ్యమైనంత కైవసముచేసికొన జూచినారు. నిజముగా ఈశక్తిమూలకముగనే ప్రజలు దేశాదాయవ్యయనిర్ణయమును హస్తగతము చేసికొని శాసననిర్వహణాధికారుల నందరను తామే యేర్పరుచునట్టి పదవిని ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాంసు ఇత్యాది దేశములలో పొందగలిగినారు. కాబట్టి నేటి నాగరకరాష్ట్రములలో నన్నిటను శాసననిర్మాణ

శాఖ రాజ్యాంగములలో ముఖ్యతమమయి తలమానిక ముగా గణింపబడుచున్నది.

## ప్రతినిధిపద్ధతి

శాసననిర్మాణమున ప్రజయెల్లయు జోక్యము కలుగజేసి కొనుటకు అవకాశము న్నయెడల ఆ రాష్ట్రమునందు ఉత్తమశాసనాధికారము న్నట్లెంచ వలయుననుట నాగరకరాష్ట్రములలో అంగీకృతమైన సిద్ధాంతము. ఈసిద్ధాంతము కార్యరూపమున కానిపిం చుటలేదు. కన్పించుట సాధ్యమునుకాదు. పూర్వకాల మున మనదేశమున నీపద్ధతియుండిన దందురు. కొంత తరు వాత ఆథెన్సునగరమున నీపద్ధతి పొడగట్టినది. కాని, అచ్చటను స్త్రీలకుగాని, బానిసలకుగాని 'వోటుకు' అర్హత యుండలేదు. పిదప కొన్నికొన్ని యూరోపుపట్టణములలో ప్రజలందరకు శాసనాధికారముండు ఛాయలుదోచినవి. నేటిదినము స్విట్జరులాండులోని కొన్ని పట్టణములలో పరి మితముగ శాసననిర్మాణ మొక కొన్నిసందర్భములలో అందరు ప్రజల స్వాధీనమైనది. ఇతర రాష్ట్రములలోను 'రెఫరెండము'అనుపేరిట నిది యంగీకృతమగుచున్నది. రాష్ట్రములు పెద్దవియై ప్రజాసమూహము మెండై యుం డుటచేత ఏదేశములోను ప్రజలందరునుచేరి శాసననిర్మా ణముచేయుట సాధ్యముకాలేదు. ఇందుకు ముఖ్యకారణ ములు రెండు. (౧) అసంఖ్యాకజనము చేరినయెడల తల కొకమాటయై ఏచిన్నవిషయమైనను తీర్మానమగుటకు నేండ్లుపూండ్లు పట్టిపోవును. (౨) అసంఖ్యాకజనముపై బరువువేసినప్పుడు ఒక్కరును జవాబుదారి తమకు కలదని

యాలోచించు వారుండరు. సమావేశము చేయవలసి వచ్చినప్పుడు అనేకులు హాజరుకాకపోవుటయు సంభవించును. ఆథెన్సు చరిత్రమును చదివినవారలకు ఒక్కవిషయము జ్ఞాపక ముండవచ్చును. అచ్చట శాసనములను చేయునట్టి సమయమున పౌరులను తెచ్చి చేర్చుటకుగాను ప్రత్యేకము అధికారులు రంగుపూసిన త్రాళ్లను గొనిపోయి వాని యావరణములోనికి పౌరులను నిర్బంధించి తెచ్చుచుండిరనుట స్మరణకు రావచ్చును. నేటిదినము ఆంగ్ల భూమిలో శాసననిర్మాణమునకు అందరుప్రజలు వచ్చుట లేదు. ౬౧౫ గురు ప్రజాప్రతినిధిసభకు రావలసియున్నారు. వీరిసభకే పార్లమెంటు (హౌసుఆఫ్ కామన్సు) అని పేరు. వీరిని అత్యవసరసమయములలో ఎక్కువ సమ్మర్దముగా రాబట్టుటకు 'చబుకు' అనునట్టి అర్థమునిచ్చు ఆంగ్లపదమయిన 'విప్పు' అనుపేరుతోబరగు నుద్యోగస్థులేర్పడి యున్నారు. ఈవిధమగు కారణములు ప్రచారమందుండుటచేత ప్రపంచమునందలి యెల్లరాష్ట్రములలోను నేటిదినము శాసననిర్మాణమును ప్రజలందరును నేకముగాజేరి చేయక తమతమ యనుకూలముల ననుసరించి, పలువిధములైన పద్ధతుల ననుకరించి ప్రతినిధులను నియమించుకొని వారిమూలకముగా శాసననిర్మాణము చేసికొనుచున్నారు. దీనినే 'ఎలెక్షన్'పద్ధతి యనియు, 'ప్రతినిధి' పద్ధతి యనియు వ్యవహరింపవచ్చును.

## రెండు సభలు

సామాన్యముగా శాసననిర్మాణమునకయి ప్రతినిధులు రెండుసభలుగా నేర్పడుచున్నారు. అచ్చము

ప్రజలప్రతినిధిసభ యొకటి. కొంచెము నూర్పుతో మరి యొకసభ యొకటి. దీనిని అప్పరుహౌసు అనుటకలదు. రాజున్నచోట ఈరెంటికితోడుగా రాజొక్కడు. రాజు లేనిచోట దేశములోని యుత్తమాధికారముపొందిన అధికారియుండును. ఇతనిని అధ్యక్షుడనుట కలదు. ఇతర పేళ్ళును దేశమునుబట్టి యేర్పడుటకలదు. రెండుశాసన సభల యధికారమును ఈమూడవయధికారి యధికార మును చేరియే శాసననిర్మాణాధికారమగును. ఆంగ్ల భూమిలో రాజుతోకూడిన శాసననిర్మాణాధికార మమలు లోనున్నది.

చరిత్రలో రెండుసభ లెట్లేర్పడినవో యాలోచింతము. ప్రజలు కన్నుతెరచి 'మాప్రతినిధులు శాసనములు చేయు నధికారముకలవారుగా నుండవలె'నని కోరునప్పటికి రాజులును, రాజులనాశ్రయించిన ప్రభువులును, సామంతులును సర్వాధికారులుగా నుండినారు. రాజు లేమిచేసినను వారియనుచరులైన ప్రభువులు సామంతులు సలహా లీయవలసియుండినారు. అందుచేత ప్రజలు నిరంకుశులగు రాజుల నుండి శాసనాధికారమును చేజిక్కించుకొను పోరాటమునందు, రాజుల అనుచరులగు ప్రభువులకును సామంతులకును గూడ స్థాన మీయవలసి వచ్చినది. మొదట మొదట వారికి బలీయమైన స్థానమే దొరకినది. అట్టివారిసభలకే శిష్టసభలని వ్యవహారముండినది. క్రమక్రమముగా ప్రజావబోధమయి జనులు తెలివితేటలుసంపాదించి తమహక్కులను స్థాపించుకొననారంభించిన తరువాత ప్రభువులబలము తగ్గి వారు శాసననిర్మాణాధికారమున నొక్కశకలము

మాత్రమయియుండిరి. ప్రజావబోధముకలిగిన తరువాత గూడ రాజులకు గావలసినవారును, ప్రభువులకు గావలసిన వారును శిష్టసభలో సభ్యులుగానుండుచు వచ్చినారు. అయిన వీరిపలుకుబడి క్రమక్రమముగా నశించిపోయినది. కొంతపలుకుబడి నిలుపుకొనియుండిన ఇంగ్లీషుప్రభువుల సభయుగూడ ౧౯౧౧-వ సంవత్సరపు పార్లమెంటు ఆక్టు కారణముగా నామమాత్రావశిష్టమయినది. అయినను ఈసభను బొత్తుగా రద్దుసేయునుద్యోగమునకు ఇంగ్లీషు ప్రజలు కడంగలేదు. ఇతరవిధముల నిర్మితములయిన శిష్ట సభలును నేటిదినము శాసననిర్మాణాధికారమున ప్రత్యే కాంగముగా నంగీకృతములయి యున్నవి. ఇట్లంగీకృత మగుటకు కారణము లారయవలయును. అనేక దేశము లలో నీశిష్టసభ పరంపరాగతమయివచ్చియున్నందున దీనిని ప్రజలు తప్పించుకొనుటకు రాలేదు. ఇది యొక కారణమే. కాని ప్రజలందరు అభిప్రాయపడినచో ఈకారణమునకు బలముండదు. వారలు ఒక్కపూటన ఈ శిష్టసభలను తుడిచి పారవేయవచ్చును. యుద్ధానంతరము అదివరలో శిష్టసభలు ప్రబలియున్న దేశములలోనుగూడ పరంపరా గత శిష్టసభలు ఈరీతిగా నశింపుపొంది క్రొత్తస్వరూప ములు దాల్చినవి. కాబట్టి శిష్టసభలు నిలిచి యుండుటకు మరి వేరుకారణము లుండి తీరవలయును.

(౧) ప్రజాసమూహ మెల్లప్పుడును శాంతముగా నాలోచించు నను కొనరాదు. ఒక్కొకసందర్భమునందు ప్రజలలో ఏదైనను పొరబాటైన అభిప్రాయము వ్యా పించి కలవరము కలుగవచ్చును. ఆసమయమునందు

ప్రజలచే నేరుగా నెన్నుకొనబడు ప్రతినిధుల సభ యొక్కటే యుండునెడల ఆసభ ప్రజల తాత్కాలికావేశమును శాసనరూపముగా స్థిరపరుపవలసి వచ్చును. తొందరలో సాగిపోయిన శాసనము త్రిప్పవలయుననిన మరల వృథాప్రయాస కలుగును. తాత్కాలికావేశము నశించినతోడనే ప్రజలు నూతనదృష్టిపథమును అవలంబింపవచ్చును. అప్పుడు కార్యము లన్నియు తారుమారగును. అట్టిరసాభాసమును ఆపుదలచేయుటకు శిష్టసభలు మిక్కిలి సహకారు లగుచున్నవి.

(౨) ప్రజాప్రతినిధుల సభలలో ఎక్కువ సంఖ్యాకుల సమ్మతుల ననుసరించి వ్యవహారములు తీర్మానములగుచున్నవి. తక్కువసంఖ్య ప్రతినిధుల నెన్నుకొను ప్రజలు ఈ ఎక్కువ సంఖ్యాకుల నిర్ణయములకు తలయొగ్గ వలసి యుండును. శిష్టసభయను మరియొకసభ లేక యుండిన యెడల తక్కువ సంఖ్యాకులగు ప్రజల ప్రతినిధులు నోరెత్తకుండ వారిని నణచివేయుట కూడ నెక్కువ సంఖ్యాకుల ప్రతినిధులకు సుకరంబగును. కాబట్టి ఎక్కువసంఖ్యాకులగు ప్రజల ప్రతినిధుల యభిప్రాయ మంగీకృతము కావలయునను సిద్ధాంతమున్నంతకాలము రెండవసభయైన శిష్టసభ లేనిచో తక్కువసంఖ్యాకుల గతి దుర్భరము కావచ్చును. వారి స్వాతంత్ర్యములు వెలివడకుండ కూడ నపహృతములు కావచ్చును. అందుచేత శిష్టసభలు ఎక్కువసంఖ్యాకుల నిరంకుశత్వమును నిరోధించుటకు సహకారు లగుచున్నవని నాగరకరాష్ట్రము లీసభలను నిలువబెట్టుకొని యున్నవి.

(3) ఇంతేకాదు. మరియొక విధముగాను నిశిష్ట సభలు ఉపయోగపడుచున్నవి. కొన్ని కొన్ని దేశములలో, ముఖ్యముగా అమెరికా సంయుక్త భూమిలో, అనేకరాష్ట్రములు ఏకప్రభుత్వముగా నేర్పడియున్నవి. ఈరాష్ట్రము లొకొక్కటియు విస్తీర్ణమునను, జనసంఖ్యయందును ఎంతెంతో భేదపడియున్నవి. ఒక్క రాష్ట్రము లక్షలమైళ్ళ వైశాల్యముకలదై కోట్లకొలది ప్రజలతో నిండియున్నది. మరియొకరాష్ట్రము నూర్లువేలకు మించనిమైళ్ళవిస్తారముకలదియై పరిమిత జనసంఖ్య కలదై యున్నది. ప్రజాప్రతినిధి సభలలోవలె సంయుక్తరాష్ట్రములకు సంబంధించిన శిష్టసభలోకూడ ప్రజాసంఖ్యానుగుణముగ నధికారమిచ్చుచో చిన్నచిన్న రాష్ట్రములను పెద్దరాష్ట్రములు కబళించి తినిపోవును. ఇట్టి మహారిష్టమును నివారించి ప్రతి రాష్ట్రమునకును ఇతరములతో సమానాధికారమిచ్చుటకు శిష్టసభ సహకారియయి యున్నది. వివిధప్రాంతములును, నానారీతులగు స్వదేశసంస్థానములును గల మన దేశమునందును సంపూర్ణమైన ప్రజాస్వామ్యము నెలకొనినపిదప 'శిష్టసభ'ల ఈవిధమగు నుపయోగమే కావచ్చును.

### అంగభేదము కావలెను

ఎప్పుడు రెండుసభలు కావలయునను సిద్ధాంతమేర్పడినదో, ఎప్పుడు రెండుసభలకును ఉద్దేశ్యములలో తారతమ్య మున్నదనుట యొప్పుకొనినామో, అప్పుడే ఈ రెండుసభలును ఒకే పద్ధతి ననుసరించి నిర్మితమైన పక్షమున లాభము లేదనుట స్పష్టముయినది. ప్రజాప్రతినిధి

సభయొక్క ప్రతిబింబముగా 'శిష్టసభ'యు సృష్టితమగు నేని అచ్చటి 'బహుసంఖ్య'యే యిచ్చటి 'బహుసంఖ్య' యగును. అచ్చటిబలమే యిచ్చటి బలమగును. అచ్చటి బలహీనులే యిచ్చటను బలహీనులుగానుందురు. కావున రెండు సభలుండుటవలన నింకను ఎక్కువ యుద్రేకము నకు, ఎక్కువ యన్యాయమునకు, ఎక్కువ యక్రమము నకు కారణము కావచ్చును. అందుచేతనే రెండు సభల యొక్క స్వరూపనిర్ణయమునందును ఏదో కొంత విభే దము కల్పించుకొనుటకు ఎల్ల దేశములును ప్రయత్నిం చినవి. ఒక్కొక్క దేశమును ఒక్కొక్క విధమగు భేద మును పాటించినది. అయిన అన్ని దేశములలోను రమా రమి ప్రజాప్రతినిధిసభ ఏకరూపమును దాల్చునట్టి ప్రయ త్నములే కొనసాగినవి. శిష్టసభవిషయమునందు మాత్ర ము అనంతస్వరూపములు కాన నగును.

ఆంగ్లభూమిలోనిశిష్టసభ పూర్ణముగా ప్రాతవాసన కలది. న్యాయవిచారకులలో నలుగురను మాత్రము సార్వ భౌముడు ప్రభుసభకు 'జీవిత' సభ్యులుగా నియమించు చున్నాడు. మతాధికారమునకు జేరిన మరికొందరు సభ్యు లును ఆసభ నలంకరించుచున్నారు. మంత్రులు తమపని సాగించుకొనుటకు సృష్టించిన "ప్రభువు"లును గలరు. కర్మకర "ప్రభువు"లును నేడు వెలసినారు. తక్కుంగల వారందరును పరంపరాగతముగా వచ్చిన ప్రభుపద బలము చేత నీసభయందు సుఖాసీనులగుచున్నారు. అప్పటి కప్పుడు మన 'సింహా' వంటివారలు ప్రభువులుగా నియో గింప బడుట కలదు. కాన నియోజితులయిన వారివంశము

లోనివారు పరంపరగా ప్రభుసభలోనికి ప్రవేశము గలవారగుచున్నారు. కావున నేటిక్రొత్త రేపటిరోత యగుచున్నది. ౭౫౦ సంఖ్యగలది ఈ ప్రభుసభ. అందులో స్కాట్లండుప్రభువులు పదునార్గురు, ఐర్లాండులు ప్రభువులు పదునార్గురు, నేటిదినము ఇండియా ప్రభువు ఒక్కరు, తక్కుంగల వారు ఆంగ్లభూమి ప్రభువులునై యున్నారు.

ప్రభుసభలో ఇందరుప్రభువులు పరంపరాగతముగా కూర్చొనుట కర్త్వలగుట యేలొకో యర్థముకాదు. పరంపరాగతసామర్థ్యము వీరికి కలుగుచున్నదాయనిన నదియున్న. పండితపుత్రు డన్నమాట పరమసత్యము. అయిన పండితపుత్రుడగువాడు పండితుడుకాడని యర్థముకాదు. కొంద రుద్దండులైన పుత్రులుందురు. కాని కొందర కన్వయించునది సామాన్యసూత్రముగా నంగీకరింపరాదుగదా! ఈ ప్రభుసభవా రొక్కొక పర్యాయము కనుబరచిన మాఢ్యమునకు మితియే లేదు. లోక మీమార్గమున నడచుచున్నదిక దా, మనమడ్డుపడిన నీప్రవాహములో మనము కొట్టుకొని పోవలసినదే కాని ప్రవాహమును నిరోధింపజాలము అను నాలోచనయే ఒక్కొక్కప్పుడు వారికి కలుగలేదు. తమస్వలాభమును, తెగయొక్క లాభమును సమకూరిన జాలునని వారలు మొండితనము కనుబరచుట వారికి సహజమైయుండినది. కాబట్టియే నేటిదినము ఆంగ్లభూమిలోని ప్రభుసభకు విశేషస్వతంత్రాధికారము లేదు. క్రమక్రమముగా ఆంగ్లప్రజ ప్రభుసభవారి రెక్కలువిరిచి వైచినారు. ఆసభవారు నేటిదినము ప్రజా

ప్రతినిధిసభవారిచే నామోదితమైన కార్యము నొకకొంత జాగుసేయు నధికారము మాత్రము కలవారై యున్నారు. మిగిలిన శాసనాధికారస్వాతంత్ర్యము లేవియును వారికి దక్కియుండలేదు. ప్రభుసభ యింతటి మహావిమర్శకు భాజనమైయుండియును ఆంగ్లభూమిలో దానికి నిలకడ కలుగుటజూడ జిత్రముగా దోచకపోదు. ప్రభుసభలోని సభ్యుల కొక్కొక్కరికిని నగరములలో, గ్రామసీమలలో ఆస్తిపాస్తు లున్నవి. వ్యాపారములలో, వ్యవహారములలో ఎక్కువ జోక్యమున్నది. సామాన్యముగా వీరలు ప్రజా కక్షులలోజేరు నభ్యాసము కలవారుకారు. కాబట్టి ప్రజలలో తీక్ష్ణసమస్యలయందావేశముకనుపట్టి వ్యవహార ముద్రేకముగా జరుగునట్టి సమయముల వీరలు నిశ్చలులై నిష్పాక్షికదృష్టితో సలహాలిచ్చి ప్రజావేశమును శాంతమార్గములకు దేగలరను నభిప్రాయమే వీరియునికికి కారణమని పలువు రాడుకొనుచున్నారు. ఇంగ్లండులోని ప్రభుసభకు మరియొక గొప్పగౌరవ మమరియున్నది. ప్రీవికౌన్సిలు అనబడు సంఘ మీసభలోని యొకభాగము. బ్రిటిషుసామ్రాజ్యములోని అన్ని యుత్తమన్యాయస్థానములందుండియు అప్పీళ్లీ ప్రీవీకౌన్సిలుకు పోవలెను. అధినివేశములలోని ప్రసిద్ధన్యాయమూర్తుల కిందు స్థానము కల్పించుచున్నారు.

మరి యేమహారాజ్యమునందును ఆంగ్లరాజ్యములోవలె పరంపరాగతపద్ధతి శిష్టసభనిర్మాణమునకు వినియోగింప బడుచుండుటలేదు. ప్రపంచమహాసంగ్రామమునకు ముందు ఆస్ట్రియా, స్పెయిను, ఇటలీ, హాలండు

లలో నీరీతి నిర్మాణ మొకకొంత యుండినది. కాని ఈరాష్ట్రములును నిపుడు ప్రజాసత్తాకములయిపోయినవి. కాబట్టి పరంపరాగతశిష్టసభకల రాజ్యము అయిరోపాలో ఇంగ్లండొక్కటియే కానవచ్చుచున్నది. బ్రిటిషురాజ్యములో చేరిన యధినివేశములలో కొన్నిటను, ఇదివరకు బ్రిటిషురాజ్యసంబంధములు కలిగిన రాష్ట్రములలోను ఈవాసన వదలలేదు. 'కనడా'లోని శిష్టసభకు గవర్నరు జనరలు యావజ్జీవసభ్యులను నియమించును. దక్షిణాఫ్రికాలో శిష్టసభ సభ్యులు ౩౨ రు ఎన్నుకొనబడుచున్నారుగాని ఎనమండుగురు మాత్రము నియమితులు గలరు. అందులో నలుగురు నల్లవారి సంరక్షణకొరకట. స్వదేశజులయి బహుసంఖ్యాకులయిన నల్లవారికిగాని, మనదేశమునుండి ఏనాడో అచ్చట చేరికొని దేశము నభివృద్ధిపరచిన హైందవులకుగాని అచ్చట స్వరాజ్యమును లేదు, వోటునులేదు. స్వల్పసంఖ్యాకులైన తెల్లవారిదే సర్వము. స్వతంత్రములుగాని యధినివేశములమాట చెప్పనక్కరయేలేదు. నిన్నటివరకును బ్రిటిషుసంరక్షణలో నుండి యింకను పూర్ణముగా స్వతంత్రముగాని ఈజిప్టులో సుల్తాను శిష్టసభలోని అయిదింట రెండువంతులను తాను నియమించును. ఇట్లే మెసెపొటేమియాలోను ప్రభువైన ఫెయిజల్ శిష్టసభలోని ఇరువదిమందిసభ్యులెల్లరను నియమించును. ౧౯౩౫-వ సంవత్సరపు గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టుననుసరించి ఇండియా అంతటికిని ఏర్పరచబోయే శిష్టసభలో మనప్రాంతికశాసనసభల ప్రతినిధులు ౧౫౬ గురతో స్వదేశసంస్థానాధీశులు నియ

మించబోయే పెద్దలు 106 గురుందురు. స్వదేశసంస్థానాధీశ్వరుల కీయధికార మిచ్చుటేగాక ఇండియాశాసనసభలలోని ప్రథమసభలోను 125 గురను మూడింట ఒక్క భాగమును నియమించే అధికారమును ఇచ్చినారు. మన ప్రాంతీయశాసనసభలలోని అప్పరు హౌసులలో గవర్నరు నియమించే సభ్యులు ఆరోవంతు కెక్కుడను ఎక్కువయుండరు. లోయరు హౌసులు పూర్ణముగా ప్రజ లెన్నుకొనేవి. కాంగ్రెసువారి పలుకుబడి బలములచేత మంత్రులు జరిపే దినచర్య పరిపాలన కడ్డుదగులునట్లు తన ప్రత్యేకాధికారములు గవర్నరు వినియోగించడములేదను సదాచారము ఏర్పడుచుండగా ఇండియాసభలను పైనచెప్పిన రీతిగా శిష్టులయు, స్వదేశసంస్థానాధీశులయు వశముచేయ వీలులేదు. కాబట్టే కాంగ్రెసువారు ఫెడరేషనును— ఇండియాప్రభుత్వమునకు క్రొత్త ఆక్టులో ఏర్పడిన విధానమును—ప్రచారములోనికి రానీయమని పట్టుబట్టినారు.

నేటిదినము ప్రపంచములో ప్రజాసత్తాకములే యెక్కువ. డిక్టేటరులుగా నేర్పడియుండు హిట్లరు, ముస్సోలినీలుగూడ తాముచేయు దుండగపు పనులకుగూడ— మొన్నటి ఆస్ట్రియా ఆక్రమణకువలె—ప్రజలవోట్లు— రెఫరెండము—కోరుచున్నారు. వారి విధానములనుగురించి ముందు వినగలరు. కాని ప్రజాపరిపాలితములలో ననేక రాష్ట్రములయందు శిష్టసభలు కలవని యెరుంగుట మాత్రము ప్రస్తుతకర్తవ్యము. వీనియం దన్నిటను శిష్టసభలకు సభ్యులను నియమించు నధికారము ప్రజల యధీనమున నేయున్నది, పరాసుభూమి, స్విట్జర్లాండు, బెల్జి

యము, నార్వే, స్వీడను, హాలండు, జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ, పోర్చుగలు, స్పెయిను, హంగరీ, పోలండు, అల్బే నియా, రుమేనియా, గ్రీసు, అయిర్లాండు, ఆస్ట్రేలియా, ఆర్జెంటైనా, బొలీవియా, బ్రెజీలు, చిలీ, చీనా, క్యూబా, జెకోస్లోవేకియా, హెయిటీ, పోలండు, సంయుక్తరాష్ట్ర ములు ఈరాజ్యములన్నిటను శిష్టసభసభ్యులు ప్రజానిర్వాచి తులుగా నుందురు. ఆఫ్రికాలో 'లైబీరియా' యను నీగ్రోల ప్రజాసత్తాకరాష్ట్ర మొకటికలదు. అచ్చటను శిష్టసభ కలదు. అందలిసభ్యులును ప్రజానిర్వాచితులు. జర్మనీ, ఇటలీలలో నియంత లేర్పడుటచేతను, హిట్లరు ఆస్ట్రియాను స్వాధీనము చేసికొనుటచేతను ఈదేశముల రాజ్యాంగస్వరూపము స్థిరము కాలేదు.

## ప రో క్ష ని ర్వ చ న ము

శిష్టసభయందుగల సభ్యులను 'ఎన్నుకొను' పద్ధ తిని అవలంబించు దేశములలో ప్రజాప్రతినిధి సభయొక్క ప్రతిబింబము ఈసభ కాకుండుటకు నిర్వచనపద్ధతులలో అనేకతారతమ్యము లేర్పడియున్నవని ఇదివరలోనే సూ చితమయినది. అందులో ప్రథమగణ్యము పరోక్షనిర్వచ నము. సమ్మతిని ఇచ్చుటకు అధికారముగల ఒక్కొక్క పురుషుడును, ఒక్కొక్క స్త్రీయును ఈతడు మాప్రతినిధిగా నుండదగినవాడని నేరుగా నియమించుకొనుపద్ధతి ప్రత్యక్ష పద్ధతియనుట ప్రత్యేకించి వ్రాయనక్కరలేదు. దీనికి దూర మైనది పరోక్షపద్ధతి. మనదేశములో శాసనసభల యెన్ని కలకు ఈపద్ధతియే ౧౯౨౦-వ సంవత్సరమునకుముందు ప్రచారము నందుండినది. అప్పుడు రు ౩౦ ల శిస్తునిచ్చు

వారందరును తాలూకాబోర్డులకు, జిల్లాబోర్డులకు సభ్యులను పేర్కొనుచుండినారు. పట్టణపాలకసంఘసభ్యులును ఈవిధమగు కొన్నిఏర్పాటుల ననుసరించి ఏరుకొనబడుచుండినారు. ఇట్లేర్పడిన జిల్లాబోర్డు తాలూకాబోర్డు సభ్యులును, పట్టణపాలకసభ్యులును శాసననిర్మాణసభకు చెందతగిన సభ్యులను ఎన్నుకొనుచుండినారు. ఇండియా శాసనసభకు సభ్యుల నెన్నుకొను నధికారము జిల్లాబోర్డు తాలూకాబోర్డు సభ్యులకును, పట్టణపాలకసభ్యులకును నుండినదికాదు. మన శాసనసభలలోని సభ్యులు తమలో నుండియే తాము నియమించుకొను చుండినారు. ఈకారణములచేత మనశాసననిర్మాణసభలలో పరోక్షపద్ధతి ద్విగుణీకృతమై చెన్నారుచుండినది. లోకములో మరియెచ్చటను ఇట్టి ద్విగుణీకృతపరోక్షపద్ధతిగాని, సామాన్యపరోక్షపద్ధతికాని ప్రజాప్రతినిధిసభలకు సంబంధించినంత వరకు లేదు. ఒక్క శిష్టసభకుమాత్రము కొన్నికొన్ని ప్రాంతములలో ఈపద్ధతి వ్యాప్తియందున్నది.

పరోక్షనిర్వాచనమున కర్థమేమి యనునది యిచ్చట గ్రహింపదగియున్నది. ప్రజాసమూహము నెడల గల యొక యపనమ్మిక ఈపద్ధతికి కారణ మనుట స్పష్టము. పరోక్షముగా ప్రతినిధు లేర్పడు నెడల ప్రజలలో తాత్కాలికముగాగల యుద్రేకములు ఆప్రతినిధినిర్వాచనమున ప్రతిబింబింపవనియు అందుచేత కార్యనిర్వాహణమున కేర్పడిన ప్రతినిధులు శాంతపరులై, ఆలోచనాయుతులై యుందురనియు విశ్వసించుటయే యీ పద్ధతికి మూలాధారమగు కారణము. నిర్వాచనాధికారము కొందరకు మాత్రమే

యున్నప్పుడు 'కక్షుల' గడబిడ నిర్వాచనములలో నంతగా ప్రతిఫలింపదనియు ఎక్కువ సంఖ్యలు సమ్మతులిచ్చు నెడల నొక్కొక్కప్పుడు కోరగానివారుగూడ ప్రతినిధులై పను లు చెడవచ్చుననియు తలంచుటయే యిందుకు బునాది. అయిన ఇట్టిభావము లెంతవరకు నిజములో పరిశీలించుట యవసరము. పరోక్షపద్ధతి కార్యక్రమమున నెంతో విజ యవంతముగా పనిచేయ లేదనుట మొదట గమనింపదగి నది. కక్షుల గడిబిడ లేకుండుననుటయు కల్ల. ఏలయందురా, శిష్టసభకు సభ్యులను నియమించునట్టి మధ్యస్థు లెట్టివారో యాలోచింపదగియున్నది. వీరుతప్పక 'కక్షులలో' నేదై నను నొక్కదానికి జేరియుందురుగాని వేరుకాదు. కాబట్టి వీరుచేయు నియామకమును 'కక్షులకు' సంబంధపడియుం డక తప్పదు. మరి పరోక్షనిర్వాచనమున నిర్వాచకవర్గము (ఓటరులవర్గము) కడుంగడు తక్కువ. అందుచేత అభ్య ర్థిగా నుండునట్టివాడుగాని, అతని మిత్రులుగాని ఈతక్కువ సంఖ్యాకులను అవినీతి పద్ధతు లవలంబించి లోబరచుకొ నుట సులభము. ప్రత్యక్షపద్ధతియందు నిర్వాచకులసంఖ్య యపరిమితము కావున నిట్టిపద్ధతులకు తా వెక్కువగా నుం డదు. ఇంతేకాదు. ప్రత్యక్షనిర్వాచనపద్ధతియున్న యెడల సమ్మతినీయ నర్హుడగు నొక్కొక్కరును ప్రతినిధి నెన్నుకొ నుట యం దెక్కువ యుత్సాహమును, అభినివేశమును జూపుటకు వీలుకలదు. అట్లుగాక ఎవ్వరో ఇతరులు శిష్ట సభకు తనపక్షమున ప్రతినిధి నెన్నుదురనిన నాతని కంత దూరము పట్టుదలయుండకపోవును. కడపటిమాట. మధ్య వర్తిని ఎన్నుకొనుటకు శక్తిశ్రద్ధలు నిర్వాచకునకు కల

వని యభిప్రాయపడినపిదప ప్రతినిధి నేరుకొనుట కేల అత
నికి శక్తిశ్రద్ధలు లేవనుకొనవలయునో నిర్ణయించుట యసాధ్యము. కాబట్టి లోకమంతటను ప్రత్యక్షపద్ధతియే
'శిష్టసభ'కును నెక్కువయెక్కువగా నన్వయమగుచున్నది.

## ఇతరాధారములు

పరోక్షనిర్వాచనపద్ధతి పనికిరాదనుకొనినచో రెండు
సభల తారతమ్యమునకుగల యితరాధారము లేవియో
విమర్శింప దగియున్నది. ప్రజాప్రతినిధిసభకును శిష్టసభ
కును సభ్యుల నెన్నుకొనునట్టి ప్రాంతములలో అనగా
దేశవైశాల్యములో విభేదముకల్పించుట యొకయాధార
ముగా నంగీకృతమయియున్నది. ప్రజాప్రతినిధిసభకు ఫిర్కా
లు, తాలూకాలు ప్రతినిధుల నెన్నుకొనుచో శిష్టసభకు
మండలములు, కోస్తాలు నియమితమగుటకలదు. ఈకార
ణముచేత 'శిష్ట' సభలో ప్రజాప్రతినిధసభయందుకంటె
తక్కువసంఖ్య యుండుట సంభవించుచున్నది. ఈతక్కువ
సంఖ్యాకులెక్కువ వివేకవంతులుగా నుందురను భావన
యు నొక్కటికలదు. ఇదివరలో జెప్పినరీతిని అమెరికా
సంయుక్తరాష్ట్రములలో ఈ 'శిష్ట' సభ నిర్మాణసమస్య
యుత్తమరీతిని తీరువబడినది. విస్తీర్ణమునందును జన
సంఖ్యయందును విస్తారమైనతారతమ్యము లున్నప్పటికిని
సంయోగమునందలి యన్నిరాష్ట్రములకును సమానముగా
సంబంధించిన విషయములలో సమత్వము కలుగజేసి తన
సంఖ్యలబలముచేతనే యొక్కరాష్ట్రము తనపలుకుబడినే
చెల్లించుకొనకుండ నిరోధించుటకు ఈసభ వినియోగపడు
చున్నది. స్విట్జరులాండులోను ఈవినియోగమే యను

కరింపబడినది. అచ్చటిప్రాంతములనుండి— వీనిని పట్ట ణములనియే చెప్పవచ్చును— ఒక్కొక్కింటికి ఇరువురు సభ్యులు శిష్టసభకు రానర్హులు. సగముప్రాంత మొక్కరిని, మరి సగముప్రాంతము మరియొక్కరిని నియమించుకొనుచున్నది. పరాసుభూమిలోను 'శిష్ట' సభకు సభ్యుల నెన్నుకొను నధికారము డిపార్టుమెంటు లనబడు రాష్ట్రములబోలు మండలములకే కలదు. కాని యొక్కొక మండలమునకును సమానమైన సంఖ్య కానరాదు. ఇద్దరు మొదలు పదుగురవరకును ప్రతినిధుల నెన్నుకొను స్వాతంత్ర్యము అచ్చటి మండలముల కేర్పడియున్నది.

శిష్టసభ సభ్యత్వమునకును ప్రజాప్రతినిధిసభ సభ్యత్వమునకును తారతమ్యము పాటించుటకు మరియొక యుపాయమును ఆలోచింపబడియున్నది. ప్రజాప్రతినిధిసభకు సభ్యత్వమున కర్హతలు వేరుగను, శిష్టసభ సభ్యత్వమున కర్హతలు వేరుగను నియమించుటకలదు. ముఖ్యముగా వయస్సు విషయమున నీవిభేద మనేక రాజ్యములలో కానవచ్చుచున్నది. ప్రజాప్రతినిధసభ్యత్వమునకు పౌరుడుగా నుండిన చాలుననుట సామాన్యసిద్ధాంతము. పౌరత్వమున కర్హత యుక్తవయస్సు వచ్చినతోడనే కలుగుచున్నది. అనగా ౨౧-౨౫ సంవత్సరముల వయస్సువాడైనచో పౌరుడు ప్రజాప్రతినిధి సభలో నాసీనుడగుటకు తగినవాడగుచున్నాడు. కాని శిష్టసభయందు ఆసీనుడగుటకో పరాసుభూమి, ఇటలీ, బెల్జియములలో ౪౦ ఏండ్లవయస్సు కలవాడు కావలెను. అమెరికాసంయుక్తరాష్ట్రములలోను, తదనుయాయులగు నితరరాజ్యములలోను అధమపక్షము

ముప్పదియేండ్లు వచ్చినగాని శిష్టసభ్యత్వమున కర్హత
యుండదు. మొత్తముమీద ప్రజాప్రతినిధి సభ్యతార్హ
తకు కావలసిన వయోగుణమునకంటె శిష్టసభ్యత్వమున
కెక్కువ వయోగుణము కావలయుననుట సామాన్యాంగీ
కారమును చెందియున్నది.

వయోగుణ మెక్కువగా పాటించుటయేకాక మరి
కొన్ని యుపాయములచేతను శిష్టసభకు స్థిరత్వము నెక్కు
వగా కల్పించుటకు నేర్పాటులు జరిగియున్నవి. ప్రజాప్రతి
నిధి సభకు అధికారకాలపరిమితి తక్కువ. శిష్టసభకు
ఎక్కువ. అమెరికాసంయుక్తరాష్ట్రములలో ప్రజాప్రతి
నిధిసభ రెండు సంవత్సరముల కొకపర్యాయము నిర్వాచిత
మగుచున్నది. శిష్టసభ ఆరు సంవత్సరముల కొక పర్యా
యము. అంతేకాదు. శిష్టసభలోని సభ్యు లెల్లరును
నొకేపర్యాయము వదలిపోవుటలేదు. ఉన్నసభ్యులలో
మూడవవంతు మూడేండ్ల కొకపర్యాయము మారుచుం
దురు. ఈవిధమగు నుపాయముల వలన రాజ్యకార్యనిర్వ
హణమునందు ఏదోకొంత స్థైర్యము కలుగుటకు అవకాశ
మేర్పరుపబడినది. శిష్టసభయు, ప్రజాప్రతినిధిసభయు ఏక
రీతిని ఒక్కటేనాడు రద్దగుచుండు నెడల, క్రొత్తగా వచ్చిన
వారు కార్యజాలమును క్రొత్తగా నుపక్రమించు చుండు
నెడల రాజ్యకార్యములు జరుగుట దుర్లభమగునను నా
లోచనయే యీతారతమ్యములకు కారణమైనది. రాజ్య
జీవితమును క్రమాభివృద్ధినందునట్టి జీవకళకలది. ప్రాతకు
ప్రాత క్రొత్తకు క్రొత్త త్రెంపిన ట్లేర్పడుచుండు నేని సరళ
మును, సహజమునునగు ప్రవృద్ధిజరుగదు. ప్రాతక్రొత్త

లను నేకప్రవాహమున దీర్చుటకు రెంటికిని కొంతసంయో
గముండదగును.

### రెండుసభల యుపయోగము

ఏదోయొకవిధమగు నుపయోగము కలదని తోచు
చున్నను, రెండు సభలవలని సుస్పష్టప్రయోజనమేమియా
యను సందేహము మాత్రము లోకమును బాధించుచునే
యున్నది. శిష్టసభలోని వారలలో నెక్కువమంది యొక
కక్షివారై, ప్రజాప్రతినిధిసభలోనివా రింకొక కక్షివారై
నప్పుడు రెండు సభలకును ఘర్షణ తప్పదు. శాసనావ
సరము కలిగినప్పుడు పనికిమాలిన పోరాటములు సంభ
వించి ఆలస్యములు జరుగుటయుకలదు. పోటీకిగాను ప్రజా
ప్రతినిధిసభ శిష్టసభకు ఇష్టముగాని శాసనమును నుపక్ర
మించుటయు కానగును. శిష్టసభ మొండిపట్టుబట్టి అభి
వృద్ధి కాటంక మగుటయు సంభవించినది. అమెరికాసం
యుక్తరాష్ట్రము లందువలె శిష్టసభకు ప్రత్యేకమగుపని
కలుగనిచోట శిష్టసభ ప్రజాగౌరవమును పోనాడుకొనినదను
టయు నిక్కువమే. ప్రత్యేకప్రాంతముల సంయోగము
సరిసమానమగు స్థితియందు సమకూరవలసి యున్నప్పుడు
శిష్టసభ యుపయోగకరమగునుగాని సామాన్యరాజ్య
కార్యనిర్వాహణమున కది యెంతో సహకారియని చెప్ప
టకురాదు.

### సభల అధికారములు

శిష్టసభకును, ప్రజాప్రతినిధిసభకును గల అధికార
ములు ఎల్లదేశములలోను రమారమి సమానముగానే
తోచుచున్నవి. రెండుసభలలోని సభ్యులును తమతమ

సభలో చట్టములను ప్రవేశ పెట్టవచ్చును. అనగా ఫలానా విషయమునుగురించి, ఉదాహరణార్థము, నీటిసరఫరాను గురించి, ఈయీరీతిగా ఈ దేశమున ఏర్పాటులు జరుగవలసినదని సంపూర్ణపద్ధతిని నియమించుచు శాసనము చేయవలసినదని ఏసభ సభ్యుడైనను ఆసభలో ఉపక్రమింపవచ్చును. ఏశాసనములో నైనను మారుపాటులు చేయవలసినదని కాని, ఏశాసనమునైనను రద్దుచేయవలసినదని కాని ఉపక్రమించుటకు రెండు సభలవారికిని అధికారము కలదు. ఒక్కసభలో తీర్మానమైన విషయమును రెండవ సభవారు ఆలోచనచేసి తమ యభిప్రాయానుసారము ఆ తీర్మానమైన విషయమును అంగీకరించుటకో, మార్చుటకో, రద్దుచేయ సలహాయిచ్చుటకో అధికారము కలవారై యుందురు.

అయిన నీకడపటి యధికారము రెండుసభలును నిరాఘాటముగా ప్రయోగించుట కవకాశ ముండినయెడల రాజ్యకార్యములు జరుగుట దుర్లభమగును. ప్రజాపరిపాలితరాష్ట్రము లన్నిటిలోను ప్రజాప్రతినిధిసభలో సభ్యులుగా నుండునట్టి వారిలో నెక్కువ పలుకుబడిగల కతిపయ సభ్యులు రాజ్యకార్యనిర్వాహకులుగా నుందురు. ఎట్టి కార్యనిర్వాహకమునకును ద్రవ్యమే మూలాధారము. ఇక రాజ్యకార్యనిర్వహణమునకు దాని యవసర మింతింతని చెప్పరాదు. ప్రజాప్రతినిధిసభవారు ఇంత ద్రవ్యము కావలెను, ఇట్లు ద్రవ్యమును సేకరింపవలయును, ఈరీతిగా నీద్రవ్యమును వ్యయపెట్టవలయును నను మున్నగు నేర్పాటులు కావించినప్పుడు శిష్టసభవారు ఇందులో నొక్క

క్క సందర్భమును ఆటంకపరచుటకు నధికారము కలవా రగుదురేని పని నిలిచి యరాచకము ప్రారంభము కావలసి వచ్చును. అందుచేత ద్రవ్యసంబంధ మగు శాసనములపై శిష్టసభలకు అనేకనాగరకరాష్ట్రములలో నెక్కువ యధి కారము పెట్టబడలేదు. ద్రవ్యమునకు సంబంధించిన శాసనమును ఆంగ్లభూమిలోని ప్రభువులసభవారు త్రోసి వేయరు అనున్యాయము ౧౯౧౧-వ సంవత్సరమువరకును ప్రబలుచువచ్చినది. త్రోసివేయరాదను నిర్బంధము మా త్రముండలేదు. ఆసంవత్సరమున ప్రజాప్రతినిధిసభనుండి యొక ద్రవ్యసంబంధి యగుశాసనము పోగా దానిని ప్రభు వులు పట్టుబట్టి త్రోసివేసిరి. అందువలన ప్రజలలో నుద్రే కము కలిగి ప్రభుసభకు నట్టి యధికారమే లేదను నిర్ధారణ యేర్పడిపోయెను. అంతేకాదు. ఏశాసనమువిషయము లోను ప్రభుసభకు తీర్మానాధికారము లేదని యంగీకృత మయ్యెను. అమెరికాసంయుక్తరాష్ట్రములలో శిష్టసభ వారు ద్రవ్యసంబంధమగు శాసనమును నుపక్రమించు టకు రాదుగాని ప్రజాప్రతినిధి సభలో నుపక్రమితమైన శాసనమునందు సవరణలు చేయవచ్చును. ఇది మిక్కిలి గొప్పయధికారమే. సవరణలనుపేరిట క్రొత్తశాసనమునే చేసివేయవచ్చును. అమెరికాసంయుక్తరాష్ట్రముల శిష్ట సభవారు ఈకారణముచేత ద్రవ్యసంబంధమగు శాసననిర్మా ణవిషయమునను ప్రజాప్రతినిధిసభవారితో సమానమైన స్వాతంత్ర్యములు కలవారయి యున్నారనియే చెప్పదగు ను. ప్రజాసత్తాకములందంతటను నింతమాత్రపు నిర్బంధ ము సామాన్యముగ కనుపించును. ఒక్క స్విట్జర్లాం

ములో మాత్రము అన్నివిషయములలోను శిష్టసభకును, ప్రజాప్రతినిధిసభకును పూర్తిగా సరిసమానమైన హక్కులు గలవు. ద్రవ్యసంబంధశాసనమని ఇతరశాసనమని భేదమిచ్చుట పాటించుటలేదు.

ప్రజాప్రతినిధిసభకు ద్రవ్యసంబంధశాసనములు చేయుటలో నెక్కువ యధికారముండ తగినదను సిద్ధాంతము నిజముగా ఆంగ్లభూమిలో జన్మించినదే. జన్మించ తగినదే. ఏలయందురా? ప్రభుసభ వట్టి శిష్టసభ కాదు. పరంతరాగతప్రభువుల సభయనుట యిదివరలోనే వర్ణితమైనది. కాబట్టి ప్రజలు అట్టిసభకు నెక్కువ శక్తులను నిలువ నిత్తురనుట యెన్నరానిమాట. ఎట్లైనను ఆంగ్లభూమిలో ప్రారంభమయిన ఈసిద్ధాంతము అనేకరాష్ట్రములలో సంగీకృతమగుటకు వేరుకారణము లుండవలెను గదా! ఆకారణము లిదివరలోనే కొంత సూచితమైనవి. అంతే కాదు. దేశాదాయము దేశప్రజలనుండి వసూలగుచున్నది. దేశప్రజలు తమ ప్రతినిధులను నేరుగా నెన్నుకొని ప్రజాప్రతినిధి సభకు ననుపుచున్నారు. ద్రవ్యమిచ్చువాడు తనకు ఎక్కువ నమ్మకము గలవానిచేత దాని వినియోగము చేయించునుగాని యొరున కంత యెక్కువగా నధికారములీయడు. ఇది మిక్కిలి సహజమైనస్థితి. కాబట్టియే ప్రజాప్రతినిధిసభలకు ద్రవ్యసంబంధవిషయకశాసనముల యెడల నెక్కువ యధికారము సమకూరినది.

బహుళప్రజలనిర్వాచనముచే నేర్పడునదగుట చేతను, ద్రవ్యాధికారము హస్తగతముచేసికొని యుండుట చేతను ప్రజాప్రతినిధిసభయే రాజ్యాంగములలో నెల్ల

నుత్తమాంగముగా పరిగణింపబడు చున్నది. ప్రజాప్ర
నిధి సభకును, శిష్టసభకును వివాదము కలిగినప్పుడు ప్ర
యెవ్వరివైపున నుండునో ప్రత్యేకించి చెప్పనక్కరలేద
ప్రజాప్రతినిధిసభ నేరుగా ప్రజలచే నెన్నుకొనబడునది
ప్రజకు నిష్టములేనిచో బహుస్వల్పకాలములో మా
పోవునది. కాబట్టి ఈసభ సర్వసామాన్యముగా ప్రజ
లోని యుద్రేకమును ననుసరించియే ప్రవర్తించుచుండును
తమ్ము ననుసరించు రాజ్యాంగసభపక్షమును ప్రజల
నహింపక శిష్టసభపక్షమును వహింతురా? ఈకారణము
చేత ఆంగ్లభూమిలో ప్రజాప్రతినిధిసభ పైయుద్ధి యయి
పోయినది. అమెరికాసంయుక్తరాష్ట్రములలోను, నేటి
యితర ప్రజాసత్తాక రాష్ట్రము లనేకములలోను శిష్టసభ,
ఆసంయోగమునందలి ప్రత్యేకరాష్ట్రముల ప్రతినిధులసభ
యయి యుండుటచేత ప్రజాప్రతినిధిసభకును, నీ సభకును
సంఘర్షణ కలుగు నవకాశములు మిక్కిలి తక్కువ.
కాబట్టి రెండుసభలకు కొంచెమించుమించుగా సరిసమాన
మైన హక్కులేర్పడి యున్నవి.

### సభలో విధానములు

ప్రజాప్రతినిధిసభ కానిండు, శిష్టసభ కానిండు ఏసభ
యైనను ఆలోచనచేసి కార్యముచేయుట కేర్పడిన సభలు
గాని ఉబుసుపోకకు కాలముపుచ్చుటకు నేర్పడిన సభలు
కావు. అందులో ఇరువురుముగ్గురు చేరునట్టి సభలును
గావు. అనేకసంఖ్యాకులు చేరునట్టి సభలు. ఇందరు చేరి
నప్పుడు కార్యక్రమము నడచుటకేదో యొకవిధానము
కావలసియుండును. అందరును ఏకకాలమున మాటలా

డుటగాని, ఒక్కొక్కరును ఇష్టమువచ్చినంతసేపు ఉపన్య
సించుటగాని, ఇష్టమువచ్చినప్పుడు ఇష్టమువచ్చినవారు లేచి
సంభాషించుటగాని పొసగినచో జాతరయైపోవును. కాబట్టి
ఒక్కొక దేశములోను శాసనసభలలో కార్యములు
సాగించుటకు సూత్రము లనేకము లేర్పడియున్నవి. ఈ
సూత్రము లన్నిటిని ఇట వివరించుటకుగాని, విమర్శించుటకు
గాని తావుచాలదు. కాని, మూడు ముఖ్యసూత్రములు
ఎల్లదేశములలోను ప్రముఖముగా నంగీకృతములై యుం
డుటనుజేసి వానిని బేర్కొనదగియున్నది.

(౧) ఏశాసనమైనను మూడుపర్యాయములు చదు
వనిది ఏసభలోను తీర్మానము కారాదు. ఇది అత్యావశ్యక
మైన సూత్రము. మనదేశములోను మునుపటికి చెప్పె
దను విను మను నభ్యాసముకలదు. ఏదోవిషయము విమ
ర్శకు తేబడినప్పుడు ఒకానొక సభ్యుడు పరధ్యానముగా
నుండవచ్చును. అలసటచెంది యుండవచ్చును. లేదా భ్రాంతి
పడియుండవచ్చును. ఊరక తలయూప వచ్చును. అయిన
నదేవిషయము మూడుపర్యాయములు చదువంబడునేని
సామాన్యముగా భ్రమప్రమాదములకు నవకాశముండదు.
ఈసూత్రమున కిదియేయర్థము. ఇందింతటి యర్థము నిండి
యున్నను సామాన్యముగా శాసనములు మొదటి కడపటి
పర్యాయములు మంత్రములవలె చదువ బడుచున్నవి.
రెండవపర్యాయము చదువబడునప్పుడు మాత్రము సభ్యు
లు మేల్కొని ఉత్సాహముతో, అభినివేశముతో విమ
ర్శకు గడంగు చున్నారు. ఆంగ్లభూమివంటి భూములలో
మాత్రము మూడు పర్యాయములును తగినంత చర్చజరు

గుట కనుకూల మేర్పడినది. ఏలయన నచ్చట సభవారు మూడు పర్యాయములును సమ్మతులు తెలిపి ఒకవిధమగు తీర్మానమునకు వచ్చినట్లుగా సూచింపవలసి యున్నారు.

(౨) శాసనమును ఉపసంఘముల యాలోచనకు బంపుట రెండవముఖ్యమగుసూత్రము. దేశశాసనసభలలో నూర్లకొలది సభ్యు లుందురు. అందరికిని అన్నివిషయములును తెలిసియుండవు. వాస్తుశాస్త్రముతో నెక్కువ సంబంధముగల శాసనము ఉపక్రమితమైనయెడల వైద్యశాస్త్రజ్ఞుడు దాని విషయమై స్థూలదృష్టిని విమర్శ చేయగలడేమోగాని సూక్ష్మాంశములలోనికి దిగి యిదమిద్ధమని తేల్చుటకు మాత్రము వలంతిగాడు. దేశమంతటికిని శాసనములు చేయుపట్టున నిట్టిసమయములు దినదినమును పొడసూపుచుండును. సూక్ష్మాంశములచర్చ నూర్లకొలది ప్రజలకు రుచించునదియుంగాదు. కాబట్టి యుపసంఘముల యాచారము వాడుకలోనికి వచ్చినది. సంగతులు తెలిసిన యొకకొందరు సావకాశముగా కూర్చొని యొక్కొక్క విషయమును విమర్శించి ఆయా శాసనమును తమసభవారికిగాని, సభలవారికిగాని నివేదించుచున్నారు. తగిన వారియాలోచన పొందినందున శాసనసభలవారు ఆశాసనమును సులభతరముగా నంగీకరించుటకో, తిరస్కరించుటకో శక్తికలవారగుదురు. ఇప్పట్టున మనకు ౧౯౨౦-లో ప్రసాదితమైన సంస్కరణశాసన మెట్లు విమర్శనందినదియు జ్ఞాపకమునకు దెచ్చికొనవచ్చును. ఆశాసనమున ముఖ్యమగు మార్పులు చేసినవారు ప్రజాప్రతినిధిసభ ప్రభుసభలలోనుండి ఏర్పడిన

యుపసంఘమువారు. వారే యేమార్పులు సూచించిరో రమారమిగా నన్నిటిని బ్రిటిషురాజ్యాంగసభలవారామోదించిరి. వారిసలహాలకు వ్యతిరేకముగా కొనిరాబడిన సవరణలన్నియును త్రోసివేయబడియెను. ఉపసంఘముల యాచారము ఎంత బలవంతమైనదియు ఈయొక్క నిదర్శనము వలననే స్పష్టమగుచున్నది. ఉపసంఘముల ప్రభావ మింకను నొక కొంతవర్ణింపదగియున్నది. ఉదాహరణార్థము అమెరికాసంయుక్తరాష్ట్రముల శిష్టసభనే కైకొందము. ఆసభలో విమర్శింపదగిన శాసనములు సంవత్సరము సంవత్సరమును వేనవేలుండును. అందుచేత ఏబది యుపసంఘము లేర్పడియున్నవి.సభయందు సామాన్యముగా మొదట చదువుటలో శాసనము పేరు,ఉద్దేశము చదువబడు చున్నది. వెంటనే దానిని తత్సంబంధియగు నుపసంఘమువారి యాలోచనకు బంపివేయుచున్నారు. ఉపసంఘమువారు అందులో కావలసినన్ని మార్పులు చేయుట కధికారము కలవారై యున్నారు. వారు దాని స్వరూపమునే వేరుచేసి దానిని క్రొత్త శాసనమునే కావింపవచ్చును. తుదకు దానిని సభవారి విమర్శకు తేకయుండవచ్చును. అనగా శాసనము ఉపసభవారి యధీనమున బడినది యనిన దాని యునికి, నాశనము వారి చేతులలోనే యున్నవనుట స్పష్టము.

(౩) విమర్శలను నిలుపుదలచేయుట కేర్పడిన సూత్రము మూడవ ముఖ్యసూత్రము. ఏసభలోనైనను ఎక్కువ సంఖ్యాకులు 'ఇక విమర్శ' చాలునని కోరుటకు అధికారము కలవారై యున్నారు. ఇది యెంత మంచి

యేర్పాటగునాయనునది యోచింపదగియున్నది. ఎక్కువ సంఖ్యాకులై మన మున్నంత మాత్రముచేత తక్కువ సంఖ్యాకులైన యెదుటివారి నోరు మూయించ వలసిన దేనా? ఇది సరియనుడు, తప్పనుడు ఆచారముమాత్రము లోకమున స్థిరమయినది. కొంతవిమర్శ సాగినపిదప ఏసభ లోనైనను ఒకసభ్యుడులేచి ఈవిమర్శ చాలించవలసినదని యుపక్రమింప వచ్చును. అట్లుపక్రమించినప్పుడు కొన్ని కొన్నిసభలలో అధ్యక్షస్థానమున నుండువారు సభవారి సమ్మతి తీసికొనవలసియుందురు. ఎక్కువ సమ్మతులు నిలుపుడు పక్షముననుండెనా నిలుపుదల చేయవలసియుం దురు. మరికొన్నిసభలలో తీర్మానముచేయు నధికారము అధ్యక్షస్థానమున నుండువారికే యొసంగబడినది. ఆంగ్ల రాజ్యాంగసభలోని ఏర్పాటు ఇదియే. అచ్చట అధ్యక్ష పదవియం దుండువానిని 'స్పీకరు' అందురు. అతని ఇష్టము వచ్చినయెడల ఆపుదలచేయవచ్చును; లేకున్న విమర్శ జరుగును గాకయని వదలవచ్చును. అమెరికాసంయుక్త రాష్ట్రములలోని ప్రజాప్రతినిధిసభలో మాత్రము సభ్యులూరక మాటలాడుట కలదట! తమమాట సాగ దనుకొనువారు ఊరక మాటలుపెట్టి ఎదుటివారిని విసి గింపజూచుట సహజము. కాబట్టి అమెరికాసంయుక్త రాష్ట్రములలోను నిర్బంధ మవసరమని ప్రయత్నములగు చున్నవి.

## ప్రతినిధి

శిష్టసభలో సభ్యుడుగా నుండు వాడైనను సరియే, ప్రజాప్రతినిధి సభలో సభ్యుడుగానుండువాడైనను సరియే

ప్రతినిధిగానుండు వాడెవడైనను తనయధికారమును తా నెరుంగుట కష్టముగానున్నది. రాజ్యలాభాలాభము లొక వైపునను, తన్ను నిర్వాచించిన ప్రాంతలాభాలాభము లొక వైపునను నుండ సమన్వయమెట్లుచేయవచ్చుననునది ఇత నికి గొప్పసమస్య యగుచున్నది. స్థూలదృష్టిని చూచి నప్పుడు ఈరెంటికిని వైరుధ్యము ఉన్నయట్లు కానరాదు. రాజ్యములో భాగమగుప్రాంతమునకు ఏదిలాభకరమో అది రాజ్యమునకు లాభకరముకావలసినదే. ప్రాంతముల ఏకత్వమగు రాజ్యమున కేది లాభకరమో అది ప్రాంత ములకు లాభకరము కావలసినదే. ఈసిద్ధాంతము బాగు గనే యున్నది కాని పలుమారు దినదినమును ఈసిద్ధాంత మునకు కొలదిగనో, గొప్పగనో కార్యక్రమమున విఘా తము కలుగుచుండును. దృష్టాంతములు కావలయునా? నేడు మనరాజధానిలోను మన ఆంధ్రభూమిలోను పొడ సూపిన సమస్యలనే యాలోచింతము. ఆంధ్రులగు మనకు ఆంధ్రరాష్ట్రమావశ్యకము. మనద్రవిడసోదరులలో పనే కుల కది యిష్టములేదు. మన మిరుతెగలవారమును శా సనసభలో నున్నారము. మనప్రతినిధు లెట్లు ప్రవర్తింప వలెనో యెవరు చెప్పగలరు! అట్లే కృష్ణమండలము రెండు కానున్నదనుకొనుడు. క్రొత్తమండలమున కేది ముఖ్య పట్టణము? ఆంధ్రప్రతినిధి తనమండలమువారి యభిప్రా యానుసారము పోవలయునా లేక తానాంధ్రదేశమున కనుకూలమనుకొను రీతిని ప్రవర్తింపవలయునా?

నిజముగా ప్రతినిధికర్తవ్యము తన్నెన్నుకొనినవారు చెప్పినట్టుగా మాత్రముచేయుట యనరాదు. ఏలయందు

రా, ఆఎన్నుకొనినవారే ప్రతినిధిస్థానమునం దుండు రేని
వారును సమయానుకూలముగా ఆలోచన చేయవలసి
యుందురు. ఏదైనను ప్రశ్న పొడసూపినప్పుడు దానికి సం
బంధించిన పూర్వాపరముల నాలోచించి తీర్మానము చేయ
వలసియుందురే కాని నాడిట్లంటిమి నేడును నిట్లేయందు
మనుటకు రాదు. తమప్రాంతపుమేలును దేశపుమేలును విత
ర్కించి దేశపుమేలునకు తమప్రాంతపు మేలును లోబ
రచవలసిన వారైనను కావచ్చును. అందుచేత ప్రతినిధు
లకు స్వాతంత్ర్య ముండవలయుట అత్యావసరమై తోచు
చున్నది.

అయిన ప్రతినిధులు తమస్వాతంత్ర్యము పేరుబెట్టు
కొని తమ్మును నియమించినవారి యభిప్రాయములను
లక్ష్యపెట్టక ప్రవర్తించుటకలదు. ఆకారణము చేత కొన్ని
కొన్ని రాష్ట్రములలో శిక్షితప్రాతినిధ్యము ప్రారంభమయి
నది. ప్రతినిధి తన్నెన్నుకొనినప్రాంతమువా రేమిచెప్పిన
నది చెప్పవలసినదే కాని స్వతంత్రాభిప్రాయ మీయరాదు.
ఈచిలుకపలుకు ప్రాతినిధ్య మంత బాగుగా నుండలేదు.
ప్రతినిధియైనవాడు తన నిర్వాచకవర్గము నప్పుడప్పుడు
కలిసికొనుచు తన యభిప్రాయములను వారికి చెప్పుచు
వారి యభిప్రాయములను తాను వినుచు సాధ్యమయినంత
మట్టుకు వారి యభిప్రాయము ననుసరించుచు ప్రవర్తించు
నెడల ఈ చిలుకపలుకుప్రాతినిధ్యముకాని, అనిరంకుశప్రా
తినిధ్యముకాని బాధింపకుండును. చక్కగా కక్షలేర్పడి
దినదినమును ఆనాటి సమస్యలపై దృఢాభిప్రాయమిచ్చు
చుండు దేశములలో ప్రతినిధి కెంతో కష్టముండదు.

ప్రతినిధిసభలయందలి లోపములచేతను, ప్రతినిధులలోపముచేతను కలుగునట్టి కష్టములను నివారించుకొనుటకు నేటి రాష్ట్రములు రెండు మూడు క్రొత్తఏర్పాటులను కావించుకొనినవి. తాము పంపిన ప్రతినిధిని తాము పదచ్యుతుని గావించుట యొకపద్ధతి. వోటరులలో ఇందరు కోరుదురేని రాజీనామానియ్యవలయుననిగాని స్థానము ఖాళీపడినట్లెంచవలసినదనిగాని నియమించుట దీనికిమార్గము. ఇట్టిమార్గమున కింగ్లీషులో 'రీకాల్' అని పేరుపెట్టినారు. ఇది విశేషము ప్రచారమునందులేదు. అమెరికా సంయుక్తరాష్ట్రములలో కొన్నిమునిసిపాలిటీలలో కలదందురు. ఇది యాచరణయోగ్యమని తోచదు. కారణము స్పష్టము. ప్రతినిధిని పంపునుద్దేశము కార్యకరణము. అందు స్వేచ్ఛకొలదిగానైన నుండదగును. లేకున్న నిత్యశంకితులే ప్రతినిధులు కావలసియుందురు. నిత్యశంకితులకు కార్యనిర్వాహణాశక్తియుండదు. వోటరులు ఎప్పుడు కోరినప్పుడు తన్ను కార్యమునుండి మరల్తురను విశ్వాసముకలవానికి దీక్షయును కొరవడును. ఈకారణముల చేత 'రీకాల్' పద్ధతి యెక్కువ వ్యాప్తినందినదిగాదు.

వోటరుల కింకొకమార్గము 'ఉపక్రమాధికారము.' దీనినే ఇంగ్లీషులో 'ఇనిషియేటివ్' అనినారు. ఏశాసనమైనను చేయవలసినదనిగాని, ఏరాజ్యకార్యములైనను నిర్వహించవలసినదనిగాని వోటరులలో అధికసంఖ్యాకులు తమయభిప్రాయమును వ్యక్తపరచవచ్చును. అప్పుడు ప్రభుత్వమువారు ఆవిషయమై యాలోచింపకతీరదు. ఇట్టి "యుపక్రమాధికారము" వోటరులకు అయిర్లండులో

గలదు. అధమపక్షము ౫౦౦౦౦-ల వోటరులయినను చేరి ననుగాని ఈ యధికారము వినియోగింప వీలులేదు. జర్మ నీలోను నిట్టియధికారము ప్రజలకు ప్రసాదితమయి యు న్నది. కాని నేడేర్పడియుండు డిక్టేటరులపద్ధతిలో వీని కర్థములేదు.

వోటరులచేతిలోని మూడవ యాయుధము రెఫ రెండము. కొన్నికొన్ని సందర్భములలో శాసనములను గురించియు, ముఖ్యవిషయములను గురించియు తాము స్వయముగానే అభిప్రాయము వ్యక్తముచేయుపద్ధతి కీపేరు కలిగినది. ప్రభుత్వములవారు అట్టి యభిప్రాయమును అమలుజరుపవలసియుండును. పరగణాలను, మండలము లను నేర్పరచుటలో సరిహద్దులను నిర్ణయించుటకును; భాషలప్రాబల్యమును నిరూపించుటకును నొకప్రాంతపు ప్రజ లింకొకప్రాంతములో చేరుట కిచ్ఛగింతురా లేదా య నుటను నిశ్చయించుటకును నీపద్ధతి చాలయుపయోగపడి నది. కడచిన యైరోపామహాసంగ్రామానంతర మేర్పడిన చిన్నచిన్న రాష్ట్రములసమస్యలు పరిష్కరించుటలో నీ పద్ధతి మాటికిమాటికి ననుసరింపవలసివచ్చినది. స్వయం నిర్ణయసూత్రమని ప్రచారమందిన సిద్ధాంతమున కిది సాధ నముగా నుపకరించుచున్నది. అస్పృశ్యుల దేవాలయ ప్రవేశమునకు మనశాసనసభలలో పెట్టదలచిన శాసనము నమలుజరుపనెంచినచో ఈపద్ధతి నవలంబించవలెనను బు నాది వైచినారు.

ఇనిషియేటివ్, రీకాలు, రెఫరెండము పద్ధతులు శా సనబద్ధముగా ప్రచారమునందున్నను, లేకపోయినను వా

క్స్వాతంత్ర్య పత్రికాస్వాతంత్ర్యములున్న దేశములలో చక్కని యాందోళనమూలకముగ వీనిఫలమును సాధించుట కవకాశమున్నది. ఇట్టి క్రొత్తఏర్పాటు కావలెనని సభలుపెట్టి తీర్మానములుచేసి వ్యాసములువ్రాసి ఇనిషియేటివునందువలె గవర్నమెంటువారిచేత క్రొత్తచట్టము చేయింపవచ్చును. శాసనసభలలో విచారణకు రాగల సంగతులనుగురించి విస్తారప్రజాభిప్రాయమును పురికొల్పి రెఫరెండముఫలము సాధింపవచ్చును. ఏప్రతినిధిచేయునట్టి పనినైనను గట్టిగా విమర్శింపించి అతడు విసిగి రాజీనామానిచ్చునట్లు చేయవచ్చును. మొండికివేసుకుంటే మరల ఎన్నికలలో రాకుండచేసి రీకాల్ ఫలమును పొందవచ్చును. అయిన నేటిలోకమున ఒకవైపు డిక్టేటరులచేతులలోని ఫేసిస్టుప్రభుత్వములవంటి ఏకపక్షప్రభుత్వములును ప్రజాపక్షములేదైనను రుష్యాలోని సోవియట్టువంటి ఏకపక్ష ప్రభుత్వములును ఏర్పడి యింతచక్కని ఫలప్రదమగు వాక్స్వాతంత్ర్య, పత్రికాస్వాతంత్ర్యము లరికట్టబడుచుండుట గమనింపదగియున్నది.

---

## ౭

# శాసననిర్వహణస్వరూపము

(అధికారశాఖ)

ఇదివరలో వ్రాయుటయందు అర్థసౌకర్యార్థము శాసననిర్మాణము, శాసనవివరణము, శాసననిర్వహణము అనుక్రమమున వ్రాసితిమి. నేటి ప్రజాపరిపాలితరాష్ట్ర

ములలో శాసననిర్వహణాధికారము నేరుగా శాసననిర్వహణాధికారులకే సంక్రమించుచుండుటచేత శాసనవివరణమునకు ముందుగా శాసననిర్వహణమును గురించి యాలోచించుటే యవసరమగుచున్నది.

ప్రాచీనకాలములయందేమి, నిన్న నేటివరకేమి శాసననిర్వహణాధికారము సామాన్యముగా రాజులకును, వారేర్పరచుకొనిన సహాయకులకును, వారు నియమించిన యధికారులకును చెందుచు వచ్చినది. అనేకరాష్ట్రములలో— రాజు నిరంకుశుడుగానుండినట్లు కానవచ్చురాష్ట్రములలో సయితము— స్థానికవిషయములయందును ఆయా ప్రాంతముల ప్రజలు తమ కార్యములను తామే నిర్వహించుకొనుచు వచ్చినది నిజమే. కాని మొత్తముగా రాజ్యమునకు సంబంధించిన కార్యనిర్వహణమునందు రాజును, అతనిచే నియమితులైనవారును మాత్రమే ప్రవర్తించుచు వచ్చిరనుట సత్యము.

### ఉత్తమాధికారి

ఎప్పుడును కార్యనిర్వహణమునకు పదుగురయధికారము పనికిరాదు. కాబట్టి నేటిదినమును ఎల్లరాష్ట్రములలోను శాసననిర్వహణము ప్రప్రథమముగా నొక్కయుత్తమాధికారియందు నిక్షిప్తమయియున్నది. పూర్ణ ప్రజాసత్తాకములలో కొన్నిటియందు వోటర్లందరునుచేరి ఉత్తమాధికారి నెన్నుకొని అతనికి అధికారకాలపరిమితయున్నంతవరకు నాలుగేండ్లో, ఎక్కువయో నిరంకుశాధికార మిచ్చివేయుటగలదు. అట్టి ప్రజాసత్తాకములను 'కేంద్రీకృతప్రజాసత్తాకము' లన్నారు. ఇంగ్లీషులో

మ్నీనికి 'సెంట్రలైజ్డు రిపబ్లిక్కు' లందురు. దక్షిణఅమెరికాలోని 'పెరూ'రాష్ట్రి మిట్టిది. మధ్యఅమెరికాలోని 'నికరాగుఆ'యు నిట్టిదియే. దక్షిణ అమెరికాలోని 'పెరూగ్వే'యు నింతియే. నేటిదినము శాసనము లనంతములు. కార్యజాలము బహుళతమము. అందుచేత ఆయుత్తమాధికారి నంటికొని రమారమి ఆతనితో సమానముగా జవాబుదారీలను పంచుకొనునట్టి యధికారులు కార్యనిర్వాహకులు కొంద రేర్పడియున్నారు. వీరే మంత్రివర్గము. పూర్వపురాజు, ఆతనిమంత్రులు— నేటి యుత్తమాధికారి, అతని మంత్రివర్గము, (లేదా, ఆతని కార్యనిర్వాహకవర్గమునకు) సరిపోవుచున్నారు. తరువాత రాష్ట్రిములోని పరిపాలనశాఖల యుత్తమాధికారులును వారిచేతిక్రింద పనిచేయునట్టి యధికారిపరంపరయు శాసననిర్వాహణాధికారధూర్వహు లగుచున్నారు. మన దేశపు పరిభాషలో జెప్పదలచితిమేని గవర్నరుజనరలు మొదలుకొని పోలీసుకనిస్టేబిలు, నీరుగట్టు తలారులవరకును శాసననిర్వహణాధికారులు.

శాసననిర్వహణాధికారమును వీరు బహువిధముల ప్రచారమునకు దెచ్చుచున్నారు. ఎల్ల రాజకార్యములకు, ఇతరకార్యములకు వలెనే, ద్రవ్యము మూలాధారము. రాజ్యమునకు ఈద్రవ్య మనునట్టిది పన్నుల మూలకమున సమకూరుచున్నది. శాసనకర్తలు పన్నులు ఏయేరీతుల విధింపవలసినది మున్నగు సూత్రములను చేయుచున్నారు. అధికారవర్గమువారు ఎంతెంతమొత్త మెవ్వరెవ్వరివద్ద నుండి రాబట్టవలసినదియు నిర్ణయించి, వసూలు చేయు

చున్నారు. ఇతర రాష్ట్రములతోటి సంబంధ బాంధవ్యము లను జరుపుటయు అధికారవర్గమునకు చెందిన స్వాతంత్ర్యమేయగును. సైనికవర్గమును, నావికవర్గమును, ఆకాశ విమానదళమును ఆయత్తపరచి వినియోగించుట, దేశము లోని పోలీసు కార్యములను నిర్వహించుట, రైళ్లురోడ్డులు ఇత్యాది సౌకర్యములను ప్రజలకు చేసియిచ్చుట, యజమానులకును పనివారలకును కలుగునట్టి సంబంధములను సమపరచినపుడు ఇత్యాది కార్యములన్నియును అధికార వర్గమువారు శాసనకర్తల ప్రతినిధులుగా చేయునట్టి కార్యములై యున్నవి. మన దేశమునకు ఈవర్ణన పూర్తిగా నన్వయించునని యనుకొనరాదు. స్వయంపరిపాలన సంపూర్ణముగా గల రాజ్యములకే యిది యన్వయమగును. శాసనకర్తలు పరిమితాధికారము కలవారుగా నున్నంతకాలము మనమీవర్ణనను ఆదర్శప్రాయముగా మాత్ర మంగీకరింపవలసి యుందుము. శాసనకర్తలు సంపూర్ణాధికారము కలవారయియుండు స్వపరిపాలితరాష్ట్రములలో గూడ అధికారవర్గమునకు శాసనకర్తల యధికారమునకు మించిన యధికారములు కొన్ని కలవు.

అధికారవర్గశిఖరమున నేకవ్యక్తి యుండుట కార్య సాధనకు ముఖ్యాధారమంటిమి. ఈఏకవ్యక్తి యాజమాన్యము రమారమిగా నేటి నాగరకరాష్ట్రము లన్నిటను కానవగును. అయిన కొన్నిచోట్ల నీఏకవ్యక్తి పేరునకు మాత్రము అధికారవర్గశిఖరము నధిష్ఠించుటయు, మరి కొన్నిచోట్ల నిజముగా సర్వాధికార ధూర్వహుడగుటయు చూడవచ్చును. అమెరికాసంయుక్తరాష్ట్రాధీశ్వరుడగు

నధ్యక్షుడు సర్వాధికారధూర్వహుడు. అతడు ఎవ్వరి సల హానైనను తీసికొనవచ్చును. ఎందరితోనైనను సంప్ర తించుకొనవచ్చును. అధికారులతోను, అనధికారులతో ను ఆలోచించు కొనవచ్చును. కాని ఎవ్వరి మాట నను సరించియు నతడు నడచుకొనవలయుననునిర్బంధము లేదు. తన యిచ్ఛకువచ్చిన రీతిని ప్రవర్తింప వచ్చును. ఎల్లయధి కారమును ఆతనిదే. ఎల్లజవాబుదారియు నాతనిదే. ఇం గ్లాండు, ఫ్రాంసు ఈ దేశములలో సర్వరాజనీతియు ఉత్త మాధికారి నిర్ణయించుటలేదు. ఇంగ్లండులో ఉత్తమాధి కారి రాజు. కాని అధికారనిర్వహణము అతని చేతులలో లేదు. మంత్రివర్గ మెట్లు చెప్పిన నట్లత డంగీకరించి కావ లెను. నిజముగా ముఖ్యమంత్రియే సర్వాధికారి. అయిన శాసనబద్ధముగ ముఖ్యమంత్రి యధికారముగాని, మంత్రి వర్గముయొక్క యధికారముగాని యెచ్చటను సూచితము కాలేదు. బహుకాలాగతమగు నాచారమే వీరికి శరణ్య ము. ఫ్రాంసులో ఉత్తమాధికారి అధ్యక్షుడు. కాని అత డును మంత్రుల యాలోచన లేక యెక్కువ స్వతంత్రించు టకు రాదు.

## సివిలు సర్వీసు

ఇట్లగుటచేత అధికారనిర్వహణ వర్గమును గురించి యాలోచించు చోట ఉత్తమాధికారి సర్వాధికారధూ ర్వహుడా, ఇతరాధికారుల యధికారముచే పరిమితుడా యని యాలోచించుట యవసరము కావచ్చును. కాని సర్వాధికారధూర్వహుడైనను కాకున్నను నొక్కమాట మాత్రము నిజము. రాజ్యకార్యములను గడుపుటకేర్ప

డిన దగిన యధికారుల పరంపరను నియమించునట్టి ముఖ్యాధికారము పూర్తిగ నతనిదైనను నగును. లేదా అతడును, అతని పరిసరవర్తులును నిర్వహించునట్టిది యైనను నగును. ఈయధికారము నుపయోగించుటయందు నక్రమములు అనేకదేశములలో పొడగట్టినవి. ఆకారణముచేత "సివిలుసర్వీసు" లనుపేరిట నెన్నటికిని మారనియట్టి అధికారవర్గము లేర్పడియున్నవి. పరీక్షలేర్పరచి తన్మూలముగా నుత్తీర్ణులగువారలను నేరి నియమించుటచేత ఉత్తమాధికారి ఇష్టానిష్టములతో నక్కరలేని యధికారవర్గమేర్పడునను నమ్మకము ఈసివిలుసర్వీసుల యుత్పత్తికి మూలాధారము. స్వపరిపాలితరాష్ట్రములలో నొక కక్షివారి ప్రాబల్యము పోయి మరియొక కక్షివారి ప్రాబల్యము సమకూరినప్పుడు కార్యనిర్వాహకు లెల్లరును మారుచుందురేని కార్యనిర్వహణ మనునదియే సున్నయగును. ఇంగ్లండు చరిత్రమునందు కొలదిమాసములకంటె నెక్కువగా అధికారమందుండని యట్టి ప్రజాప్రతినిధిసభ లెన్నియో కానవచ్చుచున్నవి. యుద్ధకాలమునందు ఇటలీ, గ్రీసు ఈరాష్ట్రములును, ఫ్రాంసును పడిన పాట్లుచూచిన యెడల నీవిషయము ఇంకను స్పష్టముగా నర్థముకాగలదు. నేటి జర్మనీచరిత్రమును దీనికి నిదర్శనము, ౧౯౧౯-వ సంవత్సరము మొదలు ౧౯౨౮-వ సంవత్సరలోపల ౧౫ మంత్రివర్గములు మారిపోయినవి. అనగా నొక్కొక మంత్రి వర్గమునకును ౮ నెలల సరాసరి జీవితమని యర్థము. నేడొక మంత్రివర్గము, రేపొక మంత్రివర్గము, మూడనాడు మరియొక మంత్రివర్గము. ఈమంత్రివర్గము లొక్కొ

క్కటియు పట్టణాధికారులు, గ్రామాధికారులు మున్నగు నెల్లనౌకరులను మార్చుచుండిరేని పరిపాలన ఎట్లు జరిగి యుండునో చదువరులే యోచించుకొనగలరు. కాబట్టి "సివిలుసర్వీసు'ల పద్ధతి—దీనినే ఆంధ్రమున "పౌరసేవో ద్యోగపద్ధతి"యని వ్యవహరించుట కలదు—ప్రజాపరిపా లితరాజ్యములలో స్థిరపడి యున్నది.

అయిన నీ 'పౌరసేవోద్యోగ' పద్ధతి ప్రజాస్వామ్య ము పూర్తిగా లేనిచోటులను, బొత్తుగా లేనిచోటులను అనర్థదాయక మయినదనుటకు సందియములేదు. ప్రజా స్వామ్యము కలచోట పౌరసేవోద్యోగులు నానాడు అధి కారమున నుండునట్టి కక్షివారియొక్క ఇష్టము ననుస రించి, అనగా, దేశమున నానాడు ప్రబలియుండు అభి ప్రాయప్రాబల్యము ననుసరించి, కార్యములు నడుపవల సిన వారగుచున్నారు. ప్రజాస్వామ్యము లేనప్పుడు ఈ యవసర మేర్పడదు. పౌరసేవోద్యోగులకు స్థానము స్థిర ము. క్రిందియుద్యోగస్థుల పరంపరను నియమించువారు తామేయగుట పలుకుబడియు స్థిరము. ఎవ్వరికిని జవాబు చెప్పవలసిన యవసరములేనప్పుడు ఇక వీరి కత్తికి అడ్డమే మున్నది? అందులోను పౌరసేవోద్యోగులు ఒక్కదేశము లో రమారమి ఒక్కటే తరగతికి చేరిన జనులలోనుండి నియమితులై ఇంకొక్కదేశమున, దూరదేశమున, అం దులోను తమభూమికి అంకితమైనదేశమున అధికారము వహించువారగుదురేని వారి నిరంకుశత్వము ఒక్కరాజు నిరంకుశత్వమునకంటె వేయిమడుంగులు దుస్సహమగు ననుట నిర్వివాదాంశము. మన భారతభూమిలో బ్రిటిషు

ప్రభుత్వము క్రింద తటస్థించిన దిదియే. ఒక్కనికి బదులు పెక్కురు, ఒక్కస్థానమునుండిగాక దేశమంతటిని నావ కించి, గ్రామగ్రామమందును తమయంశమును నిలిపి నిరంకుశత్వమును వహించుటను జేసి ప్రజాపరిపాలితరాష్ట్రములలో నెయ్యది యనుకూలపరిస్థితియో అయ్యదియే యిచ్చట ప్రతికూలపరిస్థితియై దానికి లోబడిన ప్రభుత్వపద్ధతి మంత్రివరుడైన మాంటెగ్యూచే ప్రళయమునకు పూర్వపు నాటిపద్ధతియనియు, మానవరసవిహీనపద్ధతి యనియు వర్ణితము కావలసివచ్చినది. ప్రజాప్రభుత్వము నెలకొనుకొలదిని 'సివిలుసర్వీసు' ఇతర దేశములందువలెనే మన దేశమునందును ప్రజలసేవకు సహజోపకరణమగునుగాక యని నమ్మనగును. కాంగ్రెసుమంత్రివర్గముల పరిపాలన యారంభమయినపిదప ఇందు కొంతనిజ మున్నదనుట స్పష్టమయినది. సివిలుసర్వీసులవారు తాము లాఠీదెబ్బలు కొట్టించిన వారికిగూడ భక్తులుగా పనిచేయుచున్నారు.

### అ తీ త ధ ర్మ ము లు :

అధికారవర్గము శాసననిర్మాణాధికారులచే నియమితమైన కార్యజాలమును నడుపునట్టి ప్రతినిధివర్గము మాత్రమైయుండినయెడల అధికారశాఖాప్రాబల్యము ప్రభుత్వమున నెక్కువగా నుండియుండదు. అధికారశాఖకు "శాసననిర్వహణము" ముఖ్యధర్మమైనను దాని కతీతమైన ధర్మములను కొన్నిటి నీశాఖ వహించుచున్నది. రమారమి యెల్ల నాగరికరాష్ట్రములలోను ఇట్టి శాసనము అవసరమని, శాసనముల నుపక్రమించునట్టి స్వాతంత్ర్యము సర్వసామాన్యముగా అధికారవర్గమునకే చెంది

యున్నది. మహోదారమైన పద్ధతులు వెలసియుండు ఆంగ్లరాజ్యాంగసభలో సహితము ప్రభుత్వమున నుండు కక్షివారు రాజ్యాధికారుల మూలముగా ప్రవేశపెట్టుశాసనములే మెండు. అనధికారియగు శాసనసభ్యుడు ప్రవేశపెట్టునట్టి శాసనము ఎప్పుడో యొకప్పుడుగాని కాన్పించదు. ఇది తప్పనిసరి. దినదినమును రాజ్యకార్యములను నడుపునట్టి వానికే రాజ్యవిషయములలో గల లోపాలోపములు చక్కగా బోధపడును. అతనికే ఎక్కడ నేసంస్కారమవసరమో సులభముగా తెలియవచ్చును. ఆకారణముచేత నేశాసనము చేయవలసినదియు నిర్ణయించుకొనుటకు అతనికే యుత్తమావకాశమున్నది దీనిని బురస్కరించుకొనియే మనదేశములో శాసనోపక్రమాధికారమంతయు ప్రభుత్వాధికారుల చేతులలో నిడబడినది. ప్రజాపరిపాలిత రాష్ట్రములలోనే యీస్వాతంత్ర్య మధికారవర్గమునకు ప్రబలాయుధమనిన ప్రజాపరిపాలనకు నింకను పూర్తిగ దగ్గరజేరని హైందవభూమివంటి రాష్ట్రములలో దీని ప్రభావము వర్ణింపనక్కరయే లేదు.

అధికారశాఖకుగల మరియొక స్వాతంత్ర్యము శాసననిరోధము. శాసనకర్తలయి నట్టి వారొక శాసనమును చేసినను ఉత్తమాధికారి శాసనము నంగీకరించుట లేదని శాసనమును నిరోధింపవచ్చుననుట యొకసిద్ధాంతము. ఈసిద్ధాంతము క్రమక్రమముగా కొన్నికొన్ని దేశములలో బలవిహీన మగుచున్నది. ముఖ్యముగా నాంగ్లభూమిలో నుత్తమాధికారియైన రాజునకు గల యీస్వాతంత్ర్యము నేటిదినము సంపూర్ణముగా నష్టమయియున్న

జనరలు ఇచ్చుకువచ్చిన మేరకు ప్రజలయొక్క స్వాతంత్ర్య ములనే నిరోధించు శాసనమునైనను ఆరుమాసములు అమలులో నుండునట్లు చేయవచ్చును. ఆ రేసిమాసముల చొప్పున ఆకాలవ్యవధిని పెంచుకొనవచ్చుచుండ నగునని యునుగూడ ఇటీవలిచరిత్రచేత స్థిరపడినది.

అధికారశాఖయొక్క ప్రాబల్యము ఇంతటితో తీరి పోయిన దనుకొనరాదు. ఉత్తమాధికారి శాసనసభలను నుపక్రమించుటయందును, చేర్చుట యందును, వాయి దాలు వేయుటయందును, ఆపివేయుటయందును, రద్దు చేయుటయందును కొన్నికొన్ని యధికారములు కలవాడై యున్నాడు. జర్మనీ, అమెరికా సంయుక్తరాష్ట్రముల వంటి రాష్ట్రములలో ఉత్తమాధికారితో సంబంధము లేకయే శాసనసభ సామాన్యముగా ఈనాడు, ఈసమయ మున, ఈరీతిని చేరవలసినదను కట్టుబాటుకలదు. ప్రత్యేక ముగా విశేషసమావేశము జరుపవలసి యుండిననే అధ్య క్షుడు కలుగజేసికొనవలసి యుండును. ఇంగ్లండులో ఈ పద్ధతి లేదు. శాసనసభలు చేరవలసి యున్నప్పుడు రాజు (మంత్రుల సలహామీాద) సభ్యులందరు చేరవలసినదని యు త్తరువీయవలసి యున్నాడు. అతడు నియమించిననాడు సభ చేరవలసియున్నది. ప్రత్యేకము అందుకని జాగ్రత్త గా సిద్ధముచేసిన ఉపక్రమోపన్యాసమును రాజు సభకు పంపుచున్నాడు. దానిని రాజుపేరట చదువుచున్నారు. సభ యుపక్రమమగుచున్నది. ఇంత యట్టహాసము పైకి కాన్పించినను సర్వమైన పనులును రాజుపేరుపెట్టి చేయు వారు ప్రజానిర్వాచితులగు మంత్రులేయైనందున ఆంగ్లరా

మాత్రము అధికారశాఖచేసిన నిర్ణయములను అమ
లులో పెట్టు సదుపాయములు శాసనసభలవారు చేయ
వలసి యుందురేకాని ఇతరవిధముల నానిర్ణయములను
చెనకుటకు రాదు. ఇందుకు కారణము లేకపోలేదు.
ఆంగ్లభూమిలో ఇట్టి నిర్ణయములను చేయునట్టివారు
మంత్రివర్గము. రాజు యంగీకారము రమారమిగా నామ
కార్థము. మంత్రివర్గము శాసనసభలచే నియమితము.
ఏనాడు శాసనసభలకు మంత్రివర్గముపై విశ్వాసము లేక
పోవునో ఆనాడు ఆమంత్రివర్గము రాజీనామాయిచ్చి తీర
వలసియున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రములలో
పద్ధతి భిన్నముగా నున్నది. అచ్చటి యధ్యక్షుడు ప్రజా
నిర్వాచితుడే. కాని ఒక్కపరి నిర్వాచితుడైనపిదప అతనికి
నియమితమైయుండు అధికారకాలమంతయు నతడు నిరం
కుశుడు. కాబట్టి అచ్చటి శిష్టసభవారు ఇతరరాజ్యముల
తోటి అతడు కల్పించుకొను సంబంధములలో జోక్యము
కలుగచేసికొనుటకు అవకాశము పెట్టుకొనినారు. వా
రంగీకరింపనిచో నతడు చేయు నొడంబడికలు చెల్లవు.
అతడు చేసికొనిన యొడంబడికలను వారు ఒప్పుకొనిన
నొప్పుకొనవచ్చును. మార్చిన మారువచ్చును. త్రోసి
వేసినను త్రోసివేయవచ్చును. ప్రజాప్రతినిధిసభకును
కొంత యిట్టి యధికారము కలదు. కావుననే అమెరికా
సంయుక్తరాష్ట్రాధ్యక్షుడు విల్సను ఐరోపియను రాష్ట్ర
ములతో చేసికొనిపోయిన యొడంబడికలు అమెరికా
శాసనసభలలో తీక్ష్ణవిమర్శకు పాల్పడవలసి వచ్చినవి.

యుద్ధములింకను లోకమునుండి తుడువబడిపోతే

డు. నలుగురు ఉప్పు కారము వేయుట కధికారముకల
వారైన యెడల వంటయైనను చెడిపోవుననునప్పుడు యుద్ధ
సమయములలో పదుగుర యభిప్రాయము పనికిరాదనుట
వేరుగ జెప్పబనిలేదు. ఐరోపామహాసంగ్రామము ప్రారంభ
మైనప్పుడు ఆంగ్లభూమిలో విషయములు పదుగురాలో
చించి రమూరమి బహిరంగపరచి పనిచేయుటవలన కొ
న్నిదోసగులు పొసగినవని యెల్లరెఱుంగుదురు. అట్టిస్థితి
కలుగునని యెదురుచూచియే యెల్లరాజ్యములలోను భూ
సైన్య నావికాసైన్యాధికారములను సంపూర్ణముగా
నుత్తమాధికారియధికారముననే యుంచియున్నారు. వీనికి
తగిన యధికారులను నియమించుట యుద్ధావసరములలో
నేయేపని యెట్లెట్లు నడుపవలయునో యెల్లయు నిశ్చయిం
చుట యేకముఖముగా అతనిమూలకముగా జరుగు
చున్నవి.

యుద్ధ ముపక్రమించు నధికారమును నుత్తమాధి
కారికి ఆంగ్లభూమిలో సంక్రమించియున్నది. ఉత్తమాధి
కారియనిన నిజమునకు మంత్రివర్గమేయైనందున నిదియు
ప్రజలయధీన మనుకొనవలసినదే. ఫ్రాంసుభూమిలో నధ్య
క్షుడు యుద్ధమునకు బోనెంచినప్పుడు శాసనసభల రెంటి
యుత్తరువును పొందవలెను. అమెరికాసంయుక్తరాష్ట్ర
ముల యధ్యక్షుడు ప్రజాప్రతినిధిసభ యనుమతిని పొందిన
చాలును. ప్రజాసత్తాకములలో నంతటను కొద్దికొద్ది భేద
ములతో ఈయధికారము కొంతవరకు ఉత్తమాధికారికే
సంక్రమించుచున్నది.

యుద్ధము ఉపక్రమించుట, సంధి ఇత్యాదివిషయ

ములను గురించి మనదేశములో నిప్పు డాలోచింపవలసిన పనిలేదు. మనము బ్రిటిషుసామ్రాజ్యమున కంకితులము. బ్రిటిషు అధికారులు ఏమిచేసిన నది మన మంగీకరింపవలెను. వారికి లోబడి కొద్దిగా గవర్నరుజనరలున కధికారముకలదు, ఆయధికార మెంత, యేమి, యె ట్లుపయోగపడుచున్నది యని విచారించు స్వాతంత్ర్యము మన శాసనసభలకు నేటిశాసనము మూలకముగా కలుగలేదు.

అధికారశాఖకుగల ఇంకొక్క స్వాతంత్ర్యమును గురించి వ్రాయవలసియున్నది. నేడేర్పడియుండు శాసనములు, న్యాయస్థానములు, సాక్ష్యములు, విచారణలు వీనిమూలకముగా నొకొకప్పుడు నిరపరాధులు సాపరాధులుగా దండింపబడుచున్నారనుట సిద్ధాంతముగా నంగీకరింపబడినది. నిజ మాలోచింప ఒకొకప్పుడుగాక సామాన్యముగా నిరపరాధులే దండింపబడుచున్నారాయను ననుమానము దోచకపోదు. కాబట్టి అన్నిరాజ్యములలోను ఉత్తమాధికారికి 'క్షమా'ధికార మొసంగబడియున్నది. అధికారులు గొప్ప నేరములు చేసినప్పుడు ఉత్తమాధికారి యాస్వాతంత్ర్యము నుపయోగింపవచ్చునను నవకాశమున్నచో ననర్థములు వాటిల్లుననుట స్వయంప్రకాశము. అతని యుత్తరువులేకనో అతని యెరుకతోనే యెరుకలేకయో వారుచేయు దౌర్జన్యములను, దౌష్ట్యములను క్షమించుట కతనికి అవకాశము కలుగును. అట్లు కలుగకుండుటకై ఈ 'క్షమా'ధికారము గొప్పయధికారులు చేయు నేరములపట్ల వినియోగ పడరాదని కొన్నికొన్నిరాష్ట్రములలో నియమ మేర్పడియున్నది.

ఎట్లైనను, పై నవ్రాసినవిషయములన్నిటిని ఆలోచించినయెడల నిజముగా స్వపరిపాలితరాష్ట్రములలోనే అధికారశాఖకు సహజపరిస్థితులనుబట్టి యెంతటి ప్రాబల్యముండునదియు నర్థము కాకపోదు. ఉత్తమాధికారి యీ శాఖ కంతటికిని తలమానికము. పరిపాలనయనునట్టి బహుశాఖాన్వితమహాకార్యమున కాతడు జీవకళ. శాసనసభ ప్రతినిధిగా ఈకార్యమునంతయు నిర్వహింప దక్షత కలవాడు. శాసనసభలో ప్రత్యక్షముగనో మరియేరీతినియో శాసనోపక్రమణము చేయుట యందతనికి తగినంత స్వాతంత్ర్యము కలదు. శాసనసభలలోకల పలుకుబడిచేతను, శాసనములను రద్దుచేయు నధికారముచేతను, తాత్కాలికశాసనములనుచేయు స్వాతంత్ర్యముచేతను, శాసనసభలను కూర్చుట వాయిదావేయుట రద్దుచేయుట ఇత్యాదివిషయములలోగల యధికారముచేతను, ఇతరరాష్ట్రములతో సంధిసంబంధములు నిర్ణయించుటలోగల యధికారముచేతను, సైన్యాదికముల సర్వాధిపత్యముచేతను దోషస్థులనుకొనినవారిని సయితము క్షమించుబలము కలవాడగుటచేతను అతడసమానశక్తి కలవాడగుచున్నాడు.

### ఉ త్త మా ధి కా రి ని యా మ క ము

కాబట్టి యీయుత్తమాధికారిని నియమించుటలోను, వశవర్తిని చేసికొనుటలోను నాగరకరాజ్యములు బహుజాగరూకతతో నియమనిబంధనలను కావించుకొనియున్నవి.

ఉత్తమాధికారి నియామకము ఎల్లరాష్ట్రములలోను ప్రజలయాధీనము నందులేదు. కొన్నిరాజ్యములలో

ఇప్పటికిని పరంపరాగతముగా నేర్పడురాజులు గలరు. కొన్ని రాజ్యములయందు స్త్రీలు సింహాసనమునకు రానర్హులుకారు. పురుషసంతతిలోనివారే రాజ్యాధికారనిర్వహణమునకు నర్హులు. స్త్రీలో పురుషులో ఎవ్వరు అధికారము వహించువారైనను నేటిదినము నాగరికరాష్ట్రములలో పరంపరాగతప్రభువుల శాయశక్తులు మిక్కిలి సంకుచితములై యున్నవి. ఆంగ్లభూమిలో రాజు కలడు. అతడే మన చక్రవర్తి. కాని యాతనికి ఏవిధమగు నధికారమును లేదు. అతనికి రాజకీయవిషయములలో ప్రత్యేకవ్యక్తిత్వమే లేదని చెప్పవచ్చును. రాజ్యములోని సర్వాంగములును మంత్రుల యధీనమునం దుండును. రాజుకి కన్ను, కాలు, చేయి, మెదడు సర్వమును ఈ మంత్రివర్గమే. మహాసంగ్రామమునందోడి తలదాచుకొనువరకును జర్మనీలోను సామ్రాట్టుండినాడు. అతడును సామ్రాజ్యములోని శిష్టసభకు సంపూర్ణముగా నంకితుడు. కాని అందులో చేరిన ప్రష్యాదేశమునకు నతడు నిరంకుశుడైన ప్రభువుగానున్నందున శిష్టసభలో నతనికి పలుకుబడి యెక్కువ. ఇదిగాక సామ్రాజ్యముఖ్యమంత్రిని నియమించుకొను నధికారమును అతనికి కలదు. ఆముఖ్యమంత్రి ప్రజలకు జవాబుదారీపడువాడుగాడు. చక్రవర్తికే జవాబుదారీపడువాడు. ఈకారణములచేత జర్మనీకేయిజరుయొక్క శాయశక్తులు మహాద్భుతముగా నుండినవి. నిరంకుశమగు నధికారవర్గమును నియమించి అతడు సామ్రాజ్యమును ఇష్టప్రకారము పరిపాలించుచుండినాడు. నేడు జర్మనీలో కెయిజరులేడు. అతనికితరువాత నేర్పడిన యుత్తమాధికారియు

లేదు. ప్రజాప్రతినిధి ప్రభుత్వము ౧౯౩౩-వరకు అన్ని దేశములందువలెనే సాగినది. ఆసంవత్సరమునందు హిట్లరు పార్టీవారు- వారే నాజీలు- ప్రభుత్వమునకు వచ్చిరి. సర్కారు ఉద్యోగములలో, వ్యాపారములలో, వృత్తులలో అన్నిటను యూదులకు, లిబరలులకు, సోషలిస్టులకు తావులేకుండజేసిరి. ౧౯౩౩-లో, ౧౯౩౪-లో ప్రజలు పదింటతొమ్మిదిపాళ్ళు వోట్లువేసి యీపార్టీయందు తమకు విశ్వాసమున్నదని ప్రకటించిరి. ౧౯౩౪ ఆగస్టులో అదివరకు అధ్యక్షుడుగా ఉండుచుండిన హిండెంబర్గు చనిపోయెను. ఆ స్థానమును భర్తీచేయకుండ హిట్లరు తనహోదాలో దానిని లయముచేసివేసెను. నాటినుండి జర్మనీలో హిట్లరు 'నాయకుడు'గా— వీనినే ఫ్యూరరనుటయుకలదు— ఏకపక్షనాయకుడై, సర్వాధికారధూర్వహుడై పనిచేయుచున్నాడు.

ఇప్పటికిని ఇటలీలో పరంపరాగతప్రభు వున్నాడు. కాని అచ్చటను ముస్సోలినీ 'డ్యూస' నే పేరుతో ఏకపక్షనాయకుడయి సర్వాధికారధూర్వహుడై యేలుచున్నాడు. నిజమునకు హిట్లరుకు ముస్సోలినీ గురువు. ఇతడే నేటి ఫేసిస్టు విధానమును ౧౯౨౨-వ సంవత్సరమున ఇటలీలో ప్రవేశపెట్టెను. పెట్టుబడిదారులు కర్మకరులు పోరాడుకొని జాతీయసౌభాగ్యమును చెడుపుదురను సిద్ధాంతమును ఆధారముచేసి సమభాగములుగా వారును వీరును అధికారమునకు వచ్చునట్లు చూచునుద్దేశమును ముందిడుకొని యితడు సంస్కారము లారంభించెను. వీరిద్దరకు తగవుతీర్చే యధికారిగా తనపార్టీని నియమించెను.

శాసనసభలు రెంటి యెన్నికలలోను ఈపార్టీ మొత్తము మెంబర్లనుపేర్కొని జాబితాచేయును. వోటరులు ఈ జాబితాను మొత్తముగా అంగీకరింపనైనను అంగీకరింపవలెను. తిరస్కరింపనైనను తిరస్కరింపవలెను. ఇతని పార్టీబలమున్నంతసేపు అంగీకరింపకుండుటకు వీలెక్కడిది!

పరంపరాగతపద్ధతి యింకను జపాను, పర్షియా, బెల్జియము, బల్గేరియా, డెన్మార్కు, ఈజిప్టు, మెసాపొటేమియా, ఇటలీ, హాలండు, రుమేనియా, సయాము, యూగోస్లేవియా మున్నగు స్వతంత్రరాష్ట్రములలోను బ్రిటిషువారికి, ఫ్రెంచివారికి మున్నగు అయిరోపియను రాష్ట్రములకులోబడిన సామంతరాజులు ప్రభువులుకలచోట్లను కొంతకుకొంతయో పూర్ణముగానో ప్రచారమందున్నది. ఇందు కొన్నికొన్నిట ప్రజాపరిపాలన వేరునాటి పరంపరాగతపద్ధతియొక్క నిరంకుశత్వము మట్టుపడినది. కొన్నిట ఇంకను మట్టుపడలేదు. మహాసంగ్రామము కారణముగా రుష్యా, యిత్యాదిరాజ్యముల ప్రభువులు పలాయితులయినారు. ప్రజాధికారము స్థాపితమగుటకు మహత్తరమయిన యల్లకల్లోలములు జరిగినవి, జరుగుచున్నవి.

ప్రజలు ఉత్తమాధికారిని నిర్వచించుకొను చోట్ల విధానములు భిన్నములుగా నున్నవి. శిష్టసభలకు ప్రతినిధులను నెన్నుకొనుటకు నేర్పడి యుండు ప్రత్యక్షపరోక్ష నిర్వాచనపద్ధతులు రెండును నీయుత్తమాధికారినిర్వాచనమునందు వినియోగపడుచున్నవి.

ఉత్తమాధికారిని ప్రజలే నేరుగా నెన్నుకొనుపద్ధతి అముఖ్యములైన కొన్ని రాజ్యములలోమాత్రము వ్యాప్తి

యందున్నది. దక్షిణఅమెరికాలోని పెరు, బ్రెజిలు ఇత్యాది రాజ్యములయందుమాత్రము ఈ పద్ధతి యవలంబింప బడుచున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రమునందు పేరునకు పరోక్షపద్ధతి యనుసరించుచున్నారు గాని నిజమున కది ప్రత్యక్షపద్ధతియే యని చెప్పవలసియున్నది. ప్రజలు ప్రత్యేకముగా నిర్వాచకులను నెన్నుకొనుచున్నారు. వారు అధ్యక్షుని నెన్నుకొనవలసి యుందురు. ఇది సంయుక్తరాష్ట్రములకు నేర్పడియుండు విధానము. ఈ విధముగా పరోక్షనిర్వాచనపద్ధతి అచ్చట నేర్పడి యున్నను అచ్చట ఈపరోక్షనిర్వాచనపద్ధతి నిజముగా పరోక్షపద్ధతి మాత్రముకాదు. ఏలయన, అమెరికాసంయుక్తరాష్ట్రములలో 'కక్షులు' పరిపూర్ణముగా నేర్పడియున్నవి. ఒక్కొక్క కక్షికిని మండలము మండలములోను, గ్రామము గ్రామములోను తప్పక సంస్థలు నెలకొనియున్నవి. నిర్వాచనాధికారము కలవాడొక్కడును ఈసంస్థలలో నేదో యొక సంస్థకు చేరనివాడు లేడు. ఎప్పుడు అధ్యక్షుని నియామకము కావలసియున్నను ఈ కక్షులవారు గొప్పసమావేశములలో, అనగా రాష్ట్రీయసమావేశములలో చేరి ఎవ్వడధ్యక్షుడుగానుండ నర్హుడో అతనిని పేర్కొనుచున్నారు. తరువాత ఆకక్షికి చేరినవారందరును ఆతనినే అధ్యక్షుడుగా నిర్ణయించి కావలెను. అందుచేత నామకార్థము అధ్యక్షకనిర్వాచకులుగా నేర్పడు మధ్యవర్తులగు ప్రత్యేక నిర్వాచకులును కక్షిచే నియమితుడగు వానినే నిర్వాచింపకతప్పదు. ఈకారణముచేత ఇటీవల అమెరికా సంయుక్తరాష్ట్రములలో నొకక్రొత్తయుద్యమము ప్రారంభ

మయినది. అధ్యక్షపదవికి పరోక్షనిర్వాచనము పనికిరాద
ప్రత్యక్షనిర్వాచనమే యేర్పడవలెను, అనుటయే యీ
యుద్యమముయొక్క సారాంశము. పరాసుభూమితో పర
క్షనిర్వాచనమే ఉత్తమాధికారినియమనమున కాధారమై
యున్నది. శాసనసభలు రెండును ప్రజలచే నిర్వాచితములు.
ఈరెండుసభలును చేరి అధ్యక్షుని నియమించుచున్నవి.
ఈపద్ధతి ఫలప్రదమని వాదించునట్టివారు రెండుకారణము
లను నిరూపించుటగలరు. అధ్యక్షకపదవియం దుండువార
చేయవలసినకార్యముల కొక ప్రతిభ కావలయుననుట
నిక్కవము. అట్టిప్రతిభ యెవ్వరికి పూర్తిగా గలదని నిశ్చ
యించుటకు ప్రజాసమూహమునకు తగిన శక్తి చాలదు
శాసనసభల ప్రతినిధులకు అనుభవముపైని ఆశక్తి కలిగి
యుండగలదు. ఇది మొదటికారణము. ఇక రెండవ కార
ణమో. కార్యనిర్వాహణమునందు ఒద్దికతో పనిచేయ
వలసియుండువారలు రాష్ట్రాధ్యక్షుడు, రాష్ట్రశాసనసభ.
రాష్ట్రశాసనసభవారు అధ్యక్షుని నెన్నుకొందురేని వారి
కిని, ఈతనికిని చక్కని పొందు పొసగగలదు. అవును కాని,
శాసననిర్మాతలే శాసననిర్వాహకుని నేర్పరచుట సంభ
వించుచున్నదే. ఇది నష్టదాయకముకాదా అనువారు
కొందరున్నారు. అంతియేగాక అధ్యక్షునియెన్నికలు రభ
సముతో జరుగవలసియున్నప్పుడు శాసనసభలోని సభ్యులు
అందులో నిమగ్నులయినయెడ అవసరమగు శాసననిర్మా
ణముగతి యేమగును అని మరికొంద రడుగుచున్నారు.
అధ్యక్షుడు కాదలచుకొనినవాడు తన యధ్యక్షాధికార
కాలమునందు శాసనసభసభ్యులలో పలుకుబడికలవార

లకు రాష్ట్రములో నధికారమిత్తునని వాగ్దానముచేసి వశ వర్తులను చేసికొనుటకు వీలుండదా అని ఇంక కొందరు ప్రశ్నించుచున్నారు. ఇంతియగాదు. ఏకొలదిమందికో అధ్యక్షునియామకశక్తిని ప్రసాదించినచో ఆ యధ్యక్షుడు ఆకొలదిమంది చెప్పినట్టి మాటలకు చెవియొగ్గవలసిన వాడగును. ముఖ్యమగు విషయములలో స్వతంత్రుడుగ ప్రవర్తింపలేడు. మన జిల్లాబోర్డు మునిసిపాలిటీల అధ్యక్షుల స్థితిగతులే ఇందుకు తార్కాణములు. కార్యనిర్వహణము కావింపవలసిన యధ్యక్షుడు మహాజనముచే ప్రత్యక్షముగా నెన్నుకొనబడునేని ములహాయిజా పెట్టి తన నిర్వాచకులను తనవశవర్తులుగా చేసికొనుటకుగాని నిర్వాచకులు కార్యాచరణమున నతని స్వాతంత్ర్యమును నిరోధించుటకుగాని వీలుండదు.

నిర్వచితుడైనను తనయధికారము శాశ్వతమనుకొనునేని నిరంకుశుడు కాకపోడు. అందుచేతనే ఉత్తమాధికారిని నిర్వచించుకొను రాష్ట్రములన్నియును అట్టియధికారి యధికారమునకు కాలపరిమితి ఏర్పరచియున్నారు. అమెరికాసంయుక్తరాష్ట్రముల యధ్యక్షునకు అధికారము నాల్గుసంవత్సరములకాలము. తరువాత అతడు మరల నిర్వచితుడుకావచ్చును. అగుటను నమ్మకముమాత్రము లేదు. పరాసుభూమిలో అధ్యక్షున కధికారము ఏడేండ్లు. అతడును మరల నియమితుడైనకావచ్చును. చిలీదేశపు టధ్యక్షునకు కాలపరిమితి యైదేండ్లే. అతడు మరల నిర్వచితుడు కానేకాడు. ఈ తీరుగా నిర్వచితులైన ఉత్తమాధికారులుండు రాష్ట్రములంతటను వారియధి

కార కాలము నాల్గుసంవత్సరములకు తక్కువగాక ఏడుసంవత్సరములకు నెక్కువగాక కాన్పించుచున్నది. ఇందులకు కారణము సులభముగా నూహ్యము. అధికార కాలపరిమితి మిక్కిలి తక్కువగానున్న దనుకొందము. ఒక్కసంవత్సరమే యని తీసికొందము. అప్పు డధికారమున నుండు నాత డేమిచేయగలడో యాలోచింపుడు. చుయ్యమని పెనముమీద అట్లుపోసినట్లుగా రాచకార్యములు చేయుటకు రాదు. కొంతవ్యవధియుండిననే గాని యుపక్రమితమయిన కార్యమును ఫలోన్ముఖము చేయుటకు రాదు. సంవత్సరము లోపుగా ఫలోన్ముఖత్వమును చూపుమనిన నేయధ్యక్షుడును చూపగలవాడు కాడు. మరి, సంవత్సర కాలమే యధికార కాలమందురేని ఆయధికారికి కార్యములపట్ల, యభిప్రాయములపట్ల దార్ఢ్యముగూడ శూన్యమే యగును. ఈ నాడుండి రేపు పని వదలిపోవువారమేగదా మన కేల యీగొడవ, ప్రజలలోని మూక మనల మననీయదు, "ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాట లాడి యన్యులమనముల్ నొప్పింపక తానొవ్వక తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ!" యను వెఱ్ఱి వేదాంతములకు దిగవచ్చును. ఇక నధికారపరిమితి చాల యెక్కువాయెనా—పదేండ్లు ఇరువదేండ్లయి శాశ్వతత్వమువంకకు ములునూపెనా—వచ్చినదే లాభము, చే జిక్కినదే ఫలము, అధికారమున్నంత దనుక ననుభవింతము అను దురాశ జనించి దానిపనిని అదిచేసికొనవచ్చును. ఈ యెల్ల సందర్భము లాలోచించియే నాగరక రాష్ట్రములు అధికారము నిడుపునుగాక, కుఱుచయును గాక యుండు

నట్లుగా కాలపరిమితిని నియమించి యున్నవి.

ఒక్కసారి ఉత్తమాధికారమునకు వచ్చినవాడు మరల మరల వచ్చుచుండుటకు అవకాశము ఉండతగినదేనా యనుప్రశ్న కొందరకు దోచవచ్చును. అధ్యక్షుడుగానుండి ప్రతిభావంతుడై దేశసేవ బాగుగా చేసినయట్టి యాతడు మరల తత్సేవకు నర్హుడు కాకపోవుట దేశమునకు లాభదాయకము కాదనుట నిజమే, అయిన మరల నధికారమువహించుట కర్హుడు అను నాధారముండెనేని అధికారమునకువచ్చినవాడు అధికారమును మరల సంపాదింపవలయునను నాశమై ప్రజలలో నెక్కువమందికి రుచికరముకాని కార్యము తనకు న్యాయమని తోచినప్పటికిని చేయక నూనివేయవచ్చునుగదా! చేయరాని కార్యములను చేయవచ్చును గదా! అయిన పునర్నిర్వాచనము అఖండముగా నెచ్చటను నేర్పడలేదు. అమెరికా సంయుక్త రాష్ట్రములలో పునర్నిర్వాచనమువిషయమై రాజ్యాంగ శాసనములలో నేమియు చెప్పబడియుండలేదు. కాని అచ్చట ఆచారమున నొక సిద్ధాంత మిప్పటి కేర్పడి యున్నది. మొదటి యధ్యక్షుడు పునర్నిర్వాచనమునందెనుగాని రెండుపర్యాయములకంటె నెక్కువగా నధ్యక్షపదవియందుండనని నిరాకరించెను. అది నేటికి సూత్రమయినది. రెండుపర్యాయములకంటె నేయధ్యక్షుడును నిర్వాచితుడగుటలేదు. పరాసుభూమిలో అధ్యక్షుడు పునర్నిర్వాచితుడు కాకూడదను సిద్ధాంతములేదు. పునర్నిర్వాచితుడు కాదలచుకొనిన కావచ్చును. కాని అచ్చట నట్టి పునర్నిర్వాచనముజరిగినదే లేదు. ఒక్క మెక్సికోలో మాత్రము అధ్య

త్తుడు పునర్నిర్వచనము పేరుపెట్టుకొని ౧౮౮౪ నుండి ౧౯౧౬ వరకు అనగా ౩౨ సంవత్సరములు రాజ్యమేలుట సంభవించినది. ఇతనిపేరు 'పార్ఫిరియోడయజ్'. ఇతని పరిపాలన ప్రజలకు శాంతిప్రదముగానే యుండినది. ఇతనికి తదనంతరము మెక్సికోలో అంతఃకలహములు ప్రతిదిన చర్యలై పోయెను. ౧౯౨౧ నుండి ౧౯౩౦ లోపల పదు నొకండుగురు అధ్యక్షులు మారిపోయిరి. ఇప్పటి కింకను 'మెక్సికో'కు స్థిమితములేదు. దీర్ఘ కాలము రాజ్యమేలు నట్టి యధ్యక్షులందరును 'డయజ్'వలె సమర్థులుకారు. మనసంస్థల స్థితిగతులెరింగిన వారికి ఈవిషయ మొక కొంచెము ఎక్కువగా నర్థముకావచ్చును. పేరు నిర్వచనము. కాని నిర్వచించుటయందు పలుకుబడికలవారు పరమ మిత్రులు. ఎల్లమార్గములును అనుసరణీయములు. పదవి ఏదైనను, సామాన్యసభ యొక్క కార్యదర్శిత్వమైనను సరియే, పట్టణపాలకసంఘాధ్యక్షాదికపదవులలో నొకటి యైననుసరియే— నిర్వచితుడైనవాడే నిర్వచితుడగుచున్నాడు. పని చేయనీ, చేయకపోనీ అగోడవతో నక్కరయే లేదు. సంస్థనిలువనీ సీల్లనీ అదియును నాలోచన లోనికి రాదు. ఇట్టిస్థితి మాత్రముతగదు.

ఉత్తమాధికారినియామకమందు పైసూత్రము లన్నిటికిని భిన్నముగా ప్రవర్తించు చిత్రమగు చిన్నరాష్ట్రి మొకటియున్నది. అది "సాన్‌మెరినో". అందు ౧౨౦౦౦ ప్రజలున్నారు. వారు ౬౦ మంది శాసనకర్తల నెన్నుకొందురు. వారిలో నిద్దరిని'రీజెంటులు'గా, పరిపాలకులుగా నిర్వచింతురు. వీరొక్కొక్క రారు మాసములు

రాజ్యమేలవలెను. ఒక్క యారుమాసము లేలిన పిదప మూడేడు లాన్యక్తి మరల అధికారము వహింపరాదు. ఇటలీ ఈమునిసిపలురాష్ట్రానికి సంరక్షణకర్త.

ప్రజాప్రబోధ మెక్కువగా కలదేశములయందు నామకార్థ మొక యుత్తమాధికారియున్నను నిజముగా నధికారమును నిర్వహించువారు ప్రజాప్రతినిధులేయగుటయు సంభవించియున్నది. ఆంగ్లభూమిలోను, పరాసు భూమిలోను, ఇట్టి పరిస్థితి ప్రముఖముగా కానవగుచున్నది. కాబట్టి కదలలేని మూలవిరాట్టుకుబదులు కదలికగల యుత్సవవిగ్రహములు సర్వాధికారమును తలధరించుచున్నారు. అందుచేత నీయుత్సవవిగ్రహముల వర్ణన యవసరము. ఈ యుత్సవవిగ్రహములకే మంత్రులని పేరు. వీనివర్గమునకే మంత్రివర్గమని పేరు.

## ఉత్సవవిగ్రహములు

నేటి 'మంత్రివర్గ' పద్ధతికి ఆంగ్లభూమి పుట్టినిల్లు. ఈమంత్రివర్గము పేరు ఏశాసనములోనులేదు. కాని మంత్రివర్గమునకుగల బలము మరి రాష్ట్రములోని ఏయధికారికిని కానరాదు. ఇంతటి శక్తివంతమగు సంస్థ యెట్లేర్పడినదా యను శంకయక్కరలేదు. ఆంగ్లప్రజలు శతాబ్దములుగా దీనిని కట్టుకొని వచ్చినారు. ఆచరిత్ర వ్రాయగడంగిన నది యొకగ్రంథమగును. నేడుమంత్రివర్గ మెట్లేర్పడుచున్నదో యిచ్చట వర్ణించిన చాలును. ఆంగ్ల ప్రజలు ప్రతినిధిసభను ఎన్నుకొను చున్నారు. అందులో నేదో యొక కక్షికిచేరినవారు ఎక్కువ సంఖ్యాకులుగా నుందురు. ఆకక్షికి చెందినవారిలోనుండి యొక్కరను రాజు

ముఖ్యమంత్రిగా నియమించుకొనవలెను. రాజ్యములోని యుత్తమాధికారియగు రాజున కింతకంటె నెక్కువ యధికారములేదు. ముఖ్యమంత్రి యేర్పడినతోడనే అతడు తనతో నుండి పనిచేయదగిన మంత్రు లెవ్వరో వారిని తన కక్షిలోనుండి నియమించుకొనుచున్నాడు. ఈమంత్రులే ముఖ్యమంత్రితోగూడ మంత్రివర్గ మగుచున్నారు. వీరు ఎల్లరును ప్రజాప్రతినిధులు. ప్రజలకు నేరుగా జవాబుదారి కలవారు. ఎప్పుడు ప్రజలకు వీరియెడల విశ్వాసము లేదో అప్పుడే వీరు రాజీనామా యియ్యవలసినవారు. అందుచేత ఆంగ్లభూమిలోని సర్వాధికారమును వీరియందు కేంద్రీకృతమగుచున్నది. ప్రజలలోని ఎక్కువ సంఖ్యాకుల యనురాగము వీరిపక్షమున నున్నంతకాలము వీరే ప్రజాప్రతినిధిసభకు నాయకులు. అందుచేత శాసనములు ప్రవేశపెట్టుట, శాసనములను నిర్మించుట, శాసనములను నిరోధించుట ఎల్లశక్తులును వీరియందు నిక్షిప్తములయి యున్నవి. ఇంతియగాక ఈమంత్రివర్గమునందలి యొక్కొక్కరును ప్రభుత్వశాఖ యొక్కొక్కింటికి సధ్యక్షులుగా నేర్పడుచున్నారు. కాబట్టి ఆంగ్లభూమిలో ప్రజల యనురాగమును పెట్టుకొనిన యంతకాలము మంత్రివర్గము శాసననిర్మాణనిర్వాహణముల రెంటను నుత్తమాధికారి.

ఆంగ్లభూమిలో బహుకాలముగా రెండుకక్షులే పర్పడి యున్నవి. ఇప్పుడు బలవంతమగు మూడవకక్షియు నేర్పడినది. ఈకక్షులలో స్వల్పభేదములును నున్నవి. కాని విశేషభేదములు చాలకాలముగా గాని, చాలయెక్కువగా

గాని లేకపోవుటచేత 'మంత్రివర్గము' లకు కొంతకు కొంత దీర్ఘాయువు సమకూరుటకలదు. ఇంగ్లీషువారికి వివేచనశక్తి మెండు. యుద్ధము సంప్రాప్తమయినప్పుడేమి, మహాప్రళయమువలె ఆర్థికదైన్యము లోకమును ముంచివేయుచున్ననాడేమి ఇంగ్లీషువారు ఉన్న కక్షులనుజంపుకొని సర్వశక్తలను కేంద్రీకరించిపనిచేయు నభ్యాసముచేసినారు. ఆ కారణముచేత దేశకార్యములు దీక్షతో జరుగుటకు అవకాశముదొరకి 'మంత్రివర్గము' యొక్క బలము స్థిరపడుటకు వీలైనది. పరాసుభూమిలో నిట్టిపరిస్థితి దొరకినది కాదు. అచ్చటను 'మంత్రివర్గ' పద్ధతి పూర్ణముగా నెలకొనియున్నది. 'మంత్రివర్గ'పు టనుమతిలేనిది అధ్యక్షుడేమియు చేయుటకు రాదు. ప్రజలవిశ్వాస మున్నంత కాలము 'మంత్రివర్గము' నిలుచును. వారి విశ్వాసము లేనప్పుడు వారు రాజీనామాఇచ్చి తీరవలసియున్నారు. అన్ని కట్టుదిట్టములును ఆంగ్లభూమిలో వలెనే ప్రచారమందున్నవి. కాని 'మంత్రివర్గము' పరాసుభూమిలో ఆంగ్లభూమిలోవలె అంత బలవత్తమము కాలేదు. కారణమేమందురా, పరాసుభూమిలో కక్షులు ఎక్కువ. ఒక్క కక్షికైనను నిశ్చయముగు పలుకుబడిలేదు. నేడీ కక్షిలోనివాడు రేపింకొకకక్షి. ఎల్లుండి మరియొకకక్షి. మూడవనాడు నాల్గవకక్షి. ఇట్లగుటనుచేసి మంత్రివర్గములోనే యొకకక్షివా రుండుటలేదు. ఏవో సమాధానములుచేసికొని పలువిధముల యభిప్రాయములవా రొకసమూహముగా చేరి పనిచేయుచుందురు. ఈవిధమగు నైక్యము బహుకాలము పొసగదు. కాబట్టి మంత్రివర్గము మాటికి

మాటికి—సంవత్సరములోపుగ ననియే చెప్పవచ్చును—మారుచుండుట కలదు. అదియే పరాసుభూమిలోని మంత్రివర్గపు బలహీనతకు ముఖ్యకారణము.

ఇటలీలోను పరాసుభూమిలోని స్థితిగతులే చాలకాలము కానవచ్చినవి. అసంఖ్యాకములగు కక్షులుండినవి. ఈకక్షులైనను పరాసుభూమిలోవలె తమ విభేదములు పోగొట్టుకొని తాత్కాలికముగానైనను నేకమగు మార్గమును కానరాదు, ఎవ్వరికి వారు నిర్ధారించుకొని పనిచేయుట ఆదేశమునందు ఆచారమైయుండినది. అందుచేత అచ్చట మంత్రు లేకీభవించి యొకవర్గముక్రింద నేర్పడుటే కష్టముగా నుండినది. ఒక్కొక్కరికి ప్రోత్సాహకయుండుటను బట్టి వీరి నేకముఖమునకు దెచ్చుకొను పని రాజుదే యయిపోయి అతనికి మంత్రులమీద నెక్కువ పలుకుబడి యుండుచు వచ్చినది. మంత్రులను నియమించుటయందును అతని కెక్కువ యధికారమే కలిగినది. ప్రపంచ యుద్ధానంతర మిటలీలో ప్రాతరాజకీయనాయకుల యలసత ప్రజలకు విసుగుపుట్టించినది. సీన్యోయరు ముస్సోలినీ ముఖ్యమంత్రియైనాడు. దేశసౌభాగ్యమును దీర్చుటకు గట్టిగా పనిచేయ నెంచినాడు. ఇదివరలో సంక్షేపముగా వర్ణితమైన ఫేసిస్టువిధానము నమలులో పెట్టినాడు. ఇటలీరాజు కార్యదక్షుడగు నీ మంత్రికి ప్రోత్సాహకుడుగ నున్నాడు. మొన్న హిట్లరుకు స్వాగతమిచ్చినప్పుడు ముస్సోలినీకి అగ్రమున రాజేయుండుట గమనింపదగినది.

మంత్రివర్గముపద్ధతి ఐరోపాఖండమునం దెక్కువ ప్రచారమునను న్నది. బెల్జియము, హాలండు, నార్వే,

స్వీడను ఈరాజ్యముల నెల్లను ఈపద్ధతియే నెలకొనినది. నేడు క్రొ_త్తగా నేర్పడుచుండు రాష్ట్రములలోను ఐరోపాలో నీ పద్ధతియే ప్రాబల్యము చెందవచ్చును. దీనిని పార్లమెంటరీ పద్ధతియని వర్ణింతురు.

అమెరికాఖండమునందు 'అధ్యక్షక' పద్ధతి యెక్కువ వాడుకలోనున్నది. దీనిని డెమొక్రాటికు పద్ధతియన్నారు. దీనికంటెను మంత్రివర్గపద్ధతియే ప్రజాధికారానుకూలమని అమెరికారాజనీతివే_త్తలుగూడ నంగీకరింప నారంభించినారు. ఈపద్ధతియే మన దేశమునను నెన్నటికైనను నెలకొననున్నది. ఇప్పటికి మంత్రులు కోస్తాలలో నేర్పడి రాజ్యమేలుచున్నారు. ఇండియారాజ్యాంగ శాసనములో నేమి వ్రాసియున్నను, కాంగ్రెసువారి అపార దేశభ_క్తి త్యాగములు కారణముగా, మంత్రులునడుపునట్టి అనుదినపరిపాలన కార్యక్రమమునందు గవర్నరులు తమ ప్రత్యేకాధికారములు వినియోగించికాని యితరవిధములనుగాని అడ్డము రామని యంగీకరించి అట్లే నడచుకొనుచున్నారు. ఆచారబలము శాసనబలమును రద్దుపరచునను సిద్ధాంతముతో పనులు జరుగుచున్నవి.

మంత్రిగానిండు, అధ్యక్షుడుగానిండు, డిక్టేటరుగానిండు, ఎవ్వరైనను ఉ_త్తమాధికారిగా నేర్పడువాడు చేయవలసిన పని యనంతమనుట ఇదివరలో సూచితమైనది. కాబట్టి ఆయు_త్తమాధికారి తనపనిని శాఖలక్రింద విభాగించి ఒక్కొక శాఖకును నొక్కొకయధికారిని ప్రత్యేకముగా నియమించుచున్నాడు. అతని ననుసరించి క్రింది యధికారు లెల్లరును పనిచేయవలసియుందురు. మంత్రివర్గపద్ధతి కల

చోట శాఖలకెల్ల మంత్రులే అధికారులగుచున్నారు. వారి యుత్తరువుల ననుసరించి రాజ్యకార్యములు నడుచుచున్నవి. అధ్యక్షకపద్ధతికలచోట అధ్యక్షుడు శాఖాధికారులను నియమించుట కలదు. వారు అతని యుత్తరువుమేరకు ప్రవర్తింపవలసి యుందురు.

### పరిపాలనలో నేడు ముఖ్యతనము

నేటిరాజ్యములలో ఆర్థికదృష్టితప్ప ఇతరదృష్టులన్నియు నశించినవని చెప్పవచ్చును. 'నారాజ్య మేమేమి యుత్పత్తిచేయుచున్నది? ఎంతెంత? నాప్రజలలో ఎందరకు పనిలేదు? వీరికి పనికల్పించుట యెట్లు? నా దేశపు ఎగుమతులెంత? దిగుమతులెంత? ఎగుమతులెక్కువయగుచున్నవా? దిగుమతులెక్కువయగుచున్నవా? వ్యవసాయము, పరిశ్రమలు, వ్యాపారము ఇందులో నా దేశము ఇతర దేశములతో తులతూగుచున్నదా? తగ్గిపోవుచున్నదా? ఇతర దేశములు ఇందులో నన్ను వెనుకకునెట్టకుండ నుండవలెనన్న నేనెన్నియెన్ని ఉపాయములుచేయవలెను? దిగుమతుల నరికట్టవలెనా? ఎగుమతుల నరికట్టవలెనా? సుంకములు పెంచవలెనా? సైన్యములు పెంచుకొనవలెనా? నావికాబలము పెంచుకొనవలెనా? ఆకాశవిమానబలము పెంచుకొనవలెనా? చేతికిచిక్కినప్రాంతము లాక్రమించుకొని ముడిసరకులు— వ్యవసాయముచేత తయారగునవి, ఖనిజములు— సరఫరాచేసుకొనవలెనా? నా దేశము తయారుచేసినవస్తువులకు వానిని విక్రయాంగణము చేసికొనవలెనా?'' ఇట్టివియే నేడు ప్రతిరాష్ట్రములోను రాష్ట్రకార్యనిర్వాహకులు— అధ్యక్షులుకానిండు, మంత్రులుకానిండు, డిక్టే

టరులు కానిండు— తీర్చవలసిన ప్రశ్నలుగా నేర్పడినవి. అన్నిచోట్లను సర్వప్రజలది ప్రభుత్వమని యేర్పడుట చేత సర్వప్రజల కూటికి, నీటికి, సౌఖ్యమునకు కావలసిన యెల్ల యేర్పాటులు తమవియేయని పరిపాలకులు బాధ్యత వహింపవలసి వచ్చుచున్నది. వ్యవసాయము, పరిశ్రమల తోగూడ స్వాధీనముచేసికొని— పనిచేయువారు ప్రజలే యైనను— ప్రజలలోని యెవ్వక్తియు ఇదినాయాస్తియని యనుటకు వీలులేనట్లు విత్తడము, నాటడము, ధాన్య మమ్మడము, ఇనుముకాయడము, బండ్లకమ్ములుచేయడ మువగైరా అన్నిపనులును సర్కారుద్వారానే జరుపుచుం డడము ఈదినము రుష్యాలో జరుగుచున్నది. ౧౯౩౨-లో రెండుకోట్లటన్నుల గోధుమ దేశములోపండినది. ౧౯౩౩ లో ఇంకొక ౮౦ లక్షల టన్నులు హెచ్చుచేయవలెనని సంకల్పించినారు. సాధించినారు. ఇనుము కోటి ఇరువది యొకలక్షటన్నులు తయారైనది. కోటి ఏబదిలక్షలు కావలెనన్నారు. చేసినారు. ఇవి ఉదాహరణములు. ఐదేసి సంవత్సరములకు ఒకపర్యాయము ఒక్కొక్కవస్తువును గురించి ప్లానువేయడము ఉత్పత్తిపెంచుచుపోవడము అచ్చటి గవర్నమెంటుపద్ధతి. దేశాభిమానమని ప్రేరేచి పని వారిచేత పనిచేయించడము వారికర్తవ్యము. నిండుకడుపు పెట్టనీ అరకడుపుపెట్టనీ ఆదేశములో పనిలేని మగవాడు గాని ఆడదిగాని లేడనిపించినారు. ఇంతపని జరుగవలెను కాబట్టి సోమరిపోతులనుగాని,పనికితగిన చదువు, శిక్షణాలు లేనివారినిగాని దేశములో ఉండనిచ్చుటకు వీలులేదు. అం దువలన పుట్టిన ప్రతిశిశువు చదువు, శిక్షణ, పోషణ లన్ని

టిని గవర్నమెంటే భరించినది. పని పూర్తిచేయించవల సిన బాధ్యతగల అధికారి పూర్తిచేయించలేకపోతే ప్రాణ దండనలు విధించినారు.

ఇంత సంపూర్ణముగా కాకపోయినను ఏకోద్దిభాగ మైనా ఇటువంటిపని అన్ని దేశములు చేయవలసినదిగా నున్నది. అమెరికా దేశములో ప్రెసిడెంటు రూజ్వెల్టు 'న్యూ డీలు' అని నేడు ప్రసిద్ధమైయుండు నూతనవిధానము నను సరించి పదులలక్షలకోలది పనిలేనివారికి జీవనము కల్పించి నాడు. ఇంకను ప్రయత్నించుచున్నాడు.

ప్రజల కూటికి, నీటికిసంబంధించిన ఉద్యమముల కంటే ఈవిషయములందు దేశదేశానికి కలిగియుండే పోటీ చేత దేశసంరక్షణకని ఒక్కొక్క ప్రభుత్వమువారును సృ ష్టించుచుండే పరిశ్రమ అపారముగానున్నది. ఆకాశవిమాన నిర్మాణము, యుద్ధనావలనిర్మాణము, ఫిరంగుల నిర్మాణము, మందుగుండ్లనిర్మాణము, సైనికులకు కావలసిన ఇతర వేయి న్నొక్కవస్తువుల నిర్మాణము, తుదకు వారితిండితీర్థముల సరఫరా ఈభాగమంతయు ప్రతిదేశములోను ప్రభుత్వము ద్వారా జరుగకతప్పదు. ప్రభుత్వములు ఈదినము దీనికై పెట్టుచుండేకర్చు మరిదేనికిని పెట్టడములేదు. అందులోను ఈకార్యములో అంతటను కొంతరహస్యముండి తీరవలెను. ఈకార్యసాధనకు ప్రభుత్వాలకు ఏనిమిషమునకానిమిషము దేశద్రవ్యముమీాద అధికారముండవలెను. దేశములోని ఫేక్టరీలమీాద అధికార ముండవలెను. అందులో పెట్టుబడి పెట్టువారిని బలవంతపెట్టవలసివచ్చును. పనిచేసేవారిని బలవంతపెట్టవలసివచ్చును. ప్రత్తి, అల్యూమినియము

వంటివస్తువుల ఉత్పత్తి మొదలుకొని "అవి దేశములో నుండవలెనా? బయటికి పంపవచ్చునా? ఎంత పంపవచ్చును? ఎంత నిలపవలెను?" అనే విషయాలతోకూడా నిర్ణయాలు చేసే అధికారము గవర్నమెంటు నడిపేవారి కుండవలెను. ఇన్నివివరాలకు జవాబుదారివహించి నడుపవలసిన పనివిషయమయి శాసనసభ లెంతవరకని నిర్ణయములుచేయగలవు? ౩౬౫-దినములును ౨౪-గంటలును కూర్చొనినను ఏశాసనసభయు ఈకార్యభారమంతయును వహింపలేదు. రుష్యాలో స్టాలిను ఆతనిపార్టీయనుచరులు రమారమి డిక్టేటరులుగానే పనిచేయుచున్నారు. అమెరికాలో ఎన్నికయయినతరువాత అధ్యక్షునిదే సర్వాధికారము కాబట్టి రూజ్వెల్టు నిరంకుశముగానే పనిజరిపినాడు. తుదకు సుప్రీముకోర్టు ఆతడు తీసికొనినచర్య కొంతశాసనవిరోధమని కూడ తీర్మానించినను లక్ష్యముచేయనియంత చొరవతో ప్రవర్తింపవలసివచ్చినది. తాత్కాలికముగా శాసనములుచేసికొనే అధికారము ప్రజాపరిపాలితరాష్ట్రాలలోకూడ పరిపాలనలోని ఉత్తమాధికారికి ఇచ్చుచున్నారు. ఫ్రాంసులో ఇట్టిఅధికారములులేనిది పని జరుగదని ప్రధానమంత్రి బ్లుముకోరినాడు. శాసనసభలవారు అవకాశమివ్వలేదు. అతడు రాజీనామాయిచ్చినాడు. శాసనసభవారు పరిపాలకులకు తగిన స్వాతంత్ర్యాధికారము లిచ్చువరకు స్థిమితమగు మంత్రివర్గము లేర్పడవనుటకు ఫ్రాంసుచరిత్రయేసాక్షి. అచ్చట మూడుమాసముల కొక మంత్రివర్గము మారుచున్నది. మొత్తముమీద ఇంగ్లీషువాళ్ళు గడుసువాళ్లు. వీరు శాసనముప్రాసి సభవారి అనుమతిపొందినట్లే

ఉంటుంది. కాని అందులో నాలుగుమూలల చెక్కబండీ తప్ప ఇంటిప్లానేఉండదు. ప్లానంతా సర్కారువారుచేసే నిబంధనలను అనుసరించి నడవవలసిందని వ్రాసిఉంచుతారు. పై పెచ్చురాజుగారికి ఆర్డరు ఇఁ కౌన్సిలను ఒక అధికారముంచి ఆద్వారా జరుపవచ్చునంటారు ఆ ఆర్డరు ఇఁ కౌన్సిలు వ్రాసేవారుకూడ ఈనిబంధనలు వ్రాసేవారే. అందుచేత ప్రజలవోటుతెచ్చుకొన్నంతసేపు ఇంగ్లండులో మంత్రివర్గము దేశమునకు తనకు మేలనితోచినది చేయగలుగుచున్నది.

మనదేశ మింకను మోహినుయుగములోనికి పూర్తిగా ప్రవేశించలేదు. మహాత్ముడు గాంధిపుణ్యామని మన పరిశ్రమాభివృద్ధికూడ గృహపరిశ్రమలకే ఉన్ముఖమయియున్నది. అయినను మనకుగల స్వాతంత్ర్యములు చాల తక్కువ. రాష్ట్రములలో—అనగా మద్రాసువంటి కోస్తాలలో—ప్రభుత్వమునందు మనకు స్వాతంత్ర్య మిచ్చినామన్నారు. ఏబదియైదేండ్లగా మన దేశీయమహాసభ అహరహము పోరాటము పెట్టుకొని 'వందేమాతరము', 'హోమురూలు' వంటి మహోద్యమములు బయలుదేరి తుదకు కడచిన ౧౫ ఏండ్లుగ గాంధిమహాత్ముని నాయకత్వమున అసహాయోద్యమము, ఉప్పుసత్యాగ్రహము, శాసనతిరస్కారములు, సత్యాహింసలాధారముగా దేశముకై కొని లక్షలుగ ప్రజాసామాన్యము జైళ్ళకు నడచి లాఠీదెబ్బలుతిని మహాత్యాగములుచేసిన పిదప ఈవాక్యము వెడలినది. గవర్నరుల ప్రత్యేకాధికారములని దానికిని దిగ్బంధనములు శాసనములో పెట్టినారు. కాంగ్రెసువారు ఎన్నిక

లలో ఏడురాష్ట్రములయందు అఖండముగా దిగ్విజయము పొందికూడ ఈదిగ్బంధములకులోబడి మంత్రిత్వము లంగీకరించడములేదని గట్టిగా తిరస్కరించిరి. గవర్నరులు నడమంత్రపు మంత్రుల నేర్పరచుకొని రాజ్యమేలిరి. అది సుసాధ్యముకాలేదు. అప్పుడు కాంగ్రెసుతో సమాధానముచేసికొని అనుదినపరిపాలనలో గవర్నరులు తమ ప్రత్యేకాధికారములు వినియోగించుట లేదని మాట యిచ్చిరి. కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడెను. అటుపిమ్మటను రెండు తరుణములలో తగాయిదా కలిగినది. రాజకీయఖైదీల విడుదల విషయమున మంత్రులు అందరిని విడువవలెనని, వ్యక్తుల కేసులు పరిశీలించి విడువవలెనని గవర్నరులు బీహారులోను, సంయుక్తపరగణాలలోను విభేదపడుచుండి హరిపురము కాంగ్రెసునాటికి కుదురక కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారితో సంప్రతించి మంత్రులు రాజీనామాలిచ్చిరి. గవర్నరులు ఆరాజీనామాలంగీకరింపక నిలిపి తమకు తగినంత వ్యవధి లేకపోయినదనుచు అందరు ఖైదీలను విడుదలచేయుట కంగీకరించి మంత్రులు మరల ప్రవేశించుట కవకాశము కలిగించిరి. మరల ఒరిస్సాలో నిటీవల నొక విషమస్థితి కలిగెను. గవర్నరు సెలవుమీద పోనెంచెను. అతనిస్థానమున బ్రిటిషు ప్రభుత్వమువారు అచ్చటనే నౌకరీలోనున్న ఐ.సి.ఎస్. ఆఫీసరును నియమించిరి. మంత్రులవద్ద నౌకరీచేయు ఉద్యోగి, మరల ఆనౌకరీలోనికి రావలసివచ్చినా రావలసినవాడు, మంత్రులకంటె పైహోదాలో, వారి కార్యాలోచన సభ కధ్యక్షుడుగా, వారికి యజమానిగా, కూ

ర్శోదము మంత్రుల ఆత్మగౌరవమునకు భంగమని నిర్ణ
యించి కాంగ్రెసుమంత్రులు రాజీనామాలివ్వ సిద్ధపడిరి.
విషమస్థితికలిగినదని అందరును దిక్కులుచూడ నారంభిం
చిరి. సెలవుతీసికొనిన గవర్నరు సెలవు రద్దుచేసికొని
గండముతప్పించెను. పార్లమెంటరీ శెక్రటరీలని శాసన
సభ్యులలో కొందరిని మంత్రులకు సహాయకులుగా నేర్ప
రచినారు. కాని ఇండియా రాజ్యాంగశాసనము ప్రకారము
జీతములు, బత్తెములు, సెలవులు, పెన్షనులు విషయ
ములలోను తుదకు హెచ్చరికచేసేటంత మాత్రపు దండన
విషయములందు సహా పరిపూర్ణముగా సంరక్షణపొంది
ఇప్పటికిని శెక్రటరీ అఫ్ స్టేటువల్ల నియమితులగుచుండు
ఐ.సి.ఎస్ మున్నగాగలవారు, నిన్నటివరకు రమారమి
ముప్పది డిపార్టుమెంటులను నిరంకుశముగా ఏలినవారు,
మంత్రులనుకాదనికూడ గవర్నరులదగ్గరికి ప్రత్యేకముగా
కాగితములు తీసికొనిపోవుటకు, ఉత్తరువులు చేయించు
కొనుటకు ప్రస్తుతపు ఆక్టుక్రిందను అవకాశము కలవారు,
గవర్నమెంటు శెక్రటరీలుగా ఉండి రాజ్యాంగశాసన
ములో పేరేతలపెట్టని పార్లమెంటరీ శెక్రటరీలకు కాగిత
ములు పంపుట వారి యభిప్రాయములు కనుగొనుట జరు
పుదురా? విషమస్థితి యెట్లు ఎప్పుడుకలుగునో చెప్ప వీలు
లేదు. త్వరలో కలుగకపోవచ్చును. అయినను ఇంతి
పట్టుదల యేల యుండవలెనను వారుందురు. కారణము
ఇంతవరకు చెప్పినదియే. శాసనసభ లెన్ని ఉండనీ మంత్రు
లెందరుండనీ అనుదినరాజ్యచర్య జరపడములో చాల
యెక్కువ పలుకుబడి, రుచి యున్నవి. మన మద్రాసు

కోస్తాలో ఎన్నివిధముల ఉత్తరువులు వేయడానికి అధికారులకు అవకాశములున్నవో వ్రాయబోయిన గ్రంథమగును. సర్కారువారు ప్రతి సంవత్సరమును శాసనసభ యెదుట పెట్టే బడ్జెట్టు తీసికొంటే వారు అడిగే వ్యయముల కాంక్షనులు 32 వర్గములక్రింద ఏర్పరచినారు. ఈ వర్గాలపేళ్లు క్రింద ఉదాహరించడమయినది. * ఇందులో ఒక్క రివిన్యూ తీసికొంటే అందులో అంతర్భాగాలు రివిన్యూ శెక్రటేరియట్, రివిన్యూబోర్డు, జిల్లాసిబ్బంది, సర్వేసెటల్మెంటు రికార్డుఅఫ్ రైటులు, ఇందులో ఒక్క సర్వేనూ టే తీసుకొన్నా కేంద్ర సర్వేఆఫీసు, సర్వేపార్టీలు, ఎస్టేటుసర్వేలు, మునిసిపల్ యూనియన్ సర్వేలు ఇన్ని కలవు. ఇన్నిటికి ఒక్కొక్క శాఖమీద ఒక్కొక్క అధి

---

* ౧ ల్యాండు రెవిన్యూ, ౨ ఎక్సైసు, 3 స్టాంపులు, ౪ ఫారెస్టు, ౫ రిజిస్ట్రేషను, ౬ మోటారుపన్ను, ౭ ఇర్రిగేషను, ౮ రాజధానిలో సిబ్బంది, ౯ శాసనసభలు, ౧౦ జిల్లాపరిపాలన వగైరా, ౧౧ న్యాయవిచారణ, ౧౨ జెయిళ్లు, ౧3 పోలీసు, ౧౪ ఎలెక్ట్రిసిటీ, ౧౫ విద్య, ౧౬ వైద్యము, ౧౭ ప్రజారోగ్యము, ౧౮ వ్యవసాయము, ౧౯ పశుచికిత్స, ౨౦ సహకారము(కోఆపరేషన్), ౨౧ పరిశ్రమలు, ౨౨ చేపలు, ౨3 చిల్లరడిపార్టుమెంటులు, ౨౪ కట్టడములు (సివిలువర్క్సు), ౨౫ సివిలువర్క్సు(సిబ్బందివగైరా), ౨౬ సివిలువర్క్సు (సహాయగ్రాంటులు), ౨౭ క్షామము, ౨౮ పెన్షనులు, ౨౯ స్టేషనరీ ప్రింటింగు, 3౦ చిల్లర, 3౧ ఇర్రిగేషను మీద పెట్టుబడి, 3౨ పరిశ్రమలమీద పెట్టుబడి, 33 ఎలెక్ట్రిక్కు స్కీములమీద పెట్టుబడి, 3౪ సివిలువర్క్సుమీద పెట్టుబడి, 3౫ పెన్షన్ల పెట్టుబడి మదింపు (కమ్యుటేషన్).

కారి. నేటిదినము జరిగే రివిన్యూచట్టము—అనగా బోర్డు స్టాండింగు ఆర్డరులు 3000 పేజీలు—ఈ రివిన్యూలో ఉండే పై అధికారులు వ్రాసి అమలు జరుపుతుండేదే కాని వేరు లేదు: సర్వోరాతికి పావలా ఏ సందర్భాలలో వసూలుచేయవచ్చును, ఏసందర్భాలలో వసూలు చేయరాదు అనేవిషయముతో ఆరంభించి నంజీనిపుంజీ పుంజీని నంజీగా మార్చేవరకు, గ్రామనౌకరుల సెలవు మొదలుకొని కలెక్టరుల అధికారాలవరకు, నిర్ణయించే సర్వవ్యవహారము ఈబోర్డు స్టాండింగు ఆర్డరులలో ఇమిడినది. ఇర్రిగేషన్ మాట ఆలోచించినచో దాని బడ్జెట్టు గ్రంథమే వేరేగా ప్రకటించెదరు. దీనినిబట్టి చూడగా 21 లక్షల రూపాయలు సిబ్బందివ్యయము మాత్రమున్నది. ఇర్రిగేషను పనుల మాన్యూలు, నిబంధనలు, ఏశాసనసభవారును వ్రాసినది కాదు. అంతయు అధికారులు సిద్ధపరచునదే. ఒక్క రివిన్యూ ఇలాఖాలో కోస్తా పెత్తనదారులు సుమారు ఇరువదిమంది యున్నారు. ఇర్రిగేషన్ ఇలాకాలో పెత్తనదారులకు లెక్కలేదు. చీఫ్ ఇంజనీరులు, గవర్నమెంటు ఆర్కిటెక్టు, ఎలెక్ట్రికల్ ఇంజనీరు. సూపరింటెండింగు ఇంజనీరులు, ఎక్సెక్యూటివు ఇంజనీరులు—వీరు పెట్టినదేభిక్ష. ఇట్లే ఒక్కొక్క డిపార్టుమెంటునుగురించియు, వ్రాసికొని పోవచ్చును. ముఖ్యముగా పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి నిర్మాణము, సేవకు, అధికారానికి, శాసనానికి చాల అవకాశమిచ్చునవి మన కోస్తాలో ఉన్నవి. ఇన్నిటిమీాద పెత్తనదారులందరిని మంత్రులవశము చేయవలసినదని కాంగ్రెసువారు కోరి

నారు. కాని బ్రిటిషువారు చేసిన చట్టములో అదిలేదు. అనుదినచర్యలో ఐ.సి.ఎస్ లతో సహా మంత్రులమాట జవదాటనట్లు కనిపించినా శాసనము ప్రకారము వీరు తమకు లోబడినవారు కాదు. కాబట్టి మంత్రులుకూడ తగిన జాగ్రత్తతోనే మెలగుచున్నారనుకొనదగును.

కోస్తాప్రభుత్వాలలో ఈతీరుగానుండ ఇండియా ప్రభుత్వము విషయములో బ్రిటిషు ప్రభుత్వమువారు అసలు శాసనసభలలోనే ఎన్నికలతో సంబంధము లేకుండ శిష్టసభ మొత్తమే ౨౬౦ గురలో ౧౦౪ గురను, అసెంబ్లీ మొత్తము ౨౭౫ గురలో ౧౨౫ గురను స్వదేశసంస్థానాధిపతులు ప్రతినిధులను నియమించునట్లు విధించినారు. శిష్టసభలో ౬౫ దింటిని, అసెంబ్లీలో ౧౬౪ టిని ప్రత్యేక స్థానములుగా నియమించి కాంగ్రెసువంటి బలవత్తమ ప్రజాపార్టీ ఎక్కువరాకుండ జూచుకొన ప్రయత్నించినారు. ఎన్నికలుపెట్టే స్థలములకు అప్రత్యక్షపు ఎన్నికలు నియమించి కోస్తాల శాసనసభ్యులే వోటరులుగానుండు నట్లేర్పరచినారు. ఇన్ని కోస్తాలలో కాంగ్రెసువారింత ఉద్దండముగా జయించెదరని వారనుకొనలేదని తోచును. కాని కాంగ్రెసువారు గెలిచినారు. గవర్నరుజనరలుకు ఎనిమిది ప్రత్యేకాధికారాలిచ్చుటేగాక దేశసంరక్షణ, విదేశములతోటి సంబంధము, ఇంగ్లీషు మత విచారము వీటిని శాసనసభల జోలినుండి తొలగించినారు. దేశసంరక్షణ అంటే అందులో భూసైన్యములు, నావికాసైన్యములు, విమానసైన్యము, తత్సంబంధపరిశ్రమలు అన్నియు చేరిపోయినవి. పనుగురు మంత్రుల కవకాశముచేసి వారికి

నిలిపిన విషయములలో రైల్వేలకు ప్రత్యేకము రైల్వే అథారటీ అని శాసనబద్ధసంస్థను నియమించినారు. రైల్వేలకు సంబంధించిన సర్వకార్యనిర్వహణాధికారము ఫెడరలు రైల్వేఅథారటీది. దీని అధ్యక్షుని గవర్నరుజనరలు నియమించును. ఏడింట మూడువంతులకు తక్కువగాక సభ్యులను అతడే నియమించును అని శాసనములో నున్నది. పెద్యూలులో ఇందులో సభ్యు లేర్లురుందురు. ఏర్లురను గవర్నరుజనరలు నియమించును అని యున్నది. పెద్యూలుమార్చవలసి యున్నను గవర్నరుజనరలు ఒప్పుకొనిన పిదప శాసనసభలలో బిల్లు తేవచ్చును. మంత్రిగా పర్పడేవాడు రైల్వే అథారటీకి కార్యసీతి సలహా చేయవచ్చును. అక్కడను తగవుకలిగితే గవర్నరుజనరలుది తీర్మానము. ఈ విషయమై యిక వ్రాయనేల? రైల్వేల విషయములోవలె ఆర్థికవిషయములలోను ప్రత్యేకాధికారములతో రిజర్వుబ్యాంకు అఫ్ ఇండియాను పర్పరచినారు. దీనికి సంబంధించిన చట్టమును ౧౯౩౪ వ సంవత్సరపు గవర్నమెంటు అఫ్ ఇండియా ఆక్టుకు ముందే ౧౯౩౪ లో ఇండియాశాసనసభలోనే అంగీకరింపించినారు. దానిమేరకు ఇండియా నాణ్యెములు, మన ద్రవ్యమునకు ఇతర దేశముల ద్రవ్యములతోగల సంబంధము మొదలగు విషయముల పరిపాలనయంతయు రిజర్వుబ్యాంకుకు చెందిపోయినది. ఈరిజర్వుబ్యాంకి గవర్నరును ఇద్దరు డిప్టీగవర్నరులను ఇండియాగవర్నరుజనరలు నియమించును. నలుగురు డైరెక్టరులను అతడు నియమించును. ఒక్క గవర్నమెంటు ఆఫీసరునుకూడ రిజర్వుబ్యాంకి

బోర్డుకు గవర్నరుజనరలే నియమించును. ఎనమండ్రైరి. రిజస్టరులకాని మెంబరుల వర్గాలవారు ఎనిమిదిమందిడైరె క్టరులను ఎన్నుకొందురు. వారిలో ఒక్కరు గవర్నమెంటు పక్షమైనా గవర్నమెంటుమాట మెజారిటీతో నెగ్గును. లేదా కాస్టింగువోటుతో నెగ్గును. ఇక ఈ శాసనమును ఇండియాశాసనసభవారు చేసినా దీనిని సవరించవలెనని నను, మార్చవలెనినను గవర్నరు జనరలుగారి యనుమతి మొదటనే పొందవలెను. రిజర్వుబ్యాంకును ఏకారణము-చేతనైనను రద్దుచేయదలచినను అతడే చేయవలెను. దానికి ప్రత్యామ్నాయ మేమియను నిర్ణయముకూడ అతనిదే. ఇండియాశాసనసభవారు చేసిన శాసనానికి ఇన్ని దిగ్బంధనములుచేసి వారికి దానిమీద మరల అధికారము లేకుండ చేయుటకు గవర్నమెంటు అఫ్ ఇండియా ఆక్టు ఉపయోగపరచికొనినారు.

శాసననిర్మాణవిషయము లట్లుండగా పరిపాలనవిషయములో ఇన్నిమినహాయింపులు, ఇన్నిప్రత్యేకాధికారములు, ఇందరుప్రత్యేకాధికారులను కల్పించి సంస్థానముల సంగతిలో ఇండియానేలే ప్రతినిధులనుపంపే అధికారము-వారికిచ్చి వారివ్యవహారాలలో గవర్నరుజనరలుకుకూడ అధికారాలీయక రాజప్రతినిధియనుపేరితో అతనికి వారితో సంబంధముకల్పించిన ఈ ఇండియాప్రభుత్వవిధానమును (ఫెడరేషనును) మొదలంటు కాంగ్రెసువారు ప్రతిఘటించుచున్నారనిన అందులో వింతయేమియు లేదు. శాసనాధికార పరిపాలనాధికారములు రెండును ప్రజలకు సంక్రమించిననే స్వరాజ్యమున కర్థముకలదు. పైనజెప్పిన అన్ని

విషయాలనుబట్టి నిజమునకు శాసననిర్మాణమనే పేరుతో చేసే శాసననిర్మాణముకొద్ది శాసననిర్వాహకులని మనము వ్యవహరించే దేశపరిపాలకులుచేసే శాసననిర్మాణము చాలయెక్కువ అనడముస్పష్టము. అది కారణముగానే బహుళసంఖ్యాకులయిన ప్రజల ప్రతినిధులచేతులలోనే పరిపాలన ఉండవలెననీ దూరమెక్కువవైనకొలదీ అట్టిప్రతినిధులకుకూడ జవాబుదారీతగ్గి నిరంకుశత్వం పెరగడానికి అవకాశమున్నది. కాబట్టి సాధ్యమైనంత ఎక్కువగా పరిపాలనకార్యములను స్థానికసంస్థలచేతులలోనే పెట్టవలసినదనీ, విధిలేని సమిష్టికార్యములకు విస్తారతరసంస్థలను ఉపయోగించుకొనవలసినదనీ లోకమంతటను అభిప్రాయము ప్రబలినది. రుష్యాచరిత్రకు మహాప్రాముఖ్యము కలగడానికి అచ్చటి సర్వరాజ్యసౌధాని కీ సోవియెట్టు—అనగా మనపంచాయతీవంటి గ్రామసంస్థ— బునాదిగాఏర్పడడమే. పరిపాలకులు నిరంకుశులు కాకుండా ఉండడానికి రుష్యాలో ఇతరోపాయములుకూడ అవలంబించినారు. కార్మికుల కర్షకులసంఘాలు ఎప్పటివలెనే పనిచేసికొనడానికి వాక్స్వాతంత్ర్య రచనాస్వాతంత్ర్యములనిచ్చి నిలిపినారు. ధనవంతులు, పెట్టుబడిదారులు పూర్తిగా అదృశ్యులై రాజ్యము కార్మికులదీ కర్షకులదీ యైనప్పటికీ ప్రభుత్వమునడిపేవారు తమతోకొద్దిగా భేదపడేవారున్నా వారిప్రచారాలను అరికట్టి తమప్రచారాన్ని సాగించుకొని ఎదుటిమతాలనణచిపెట్టి తమమతాలను బలపరచుకొని నిరంకుశులయ్యే ప్రయత్నము చేయవచ్చును. తాత్కాలికముగానైనా మహాజనము తమకు వ్యతిరేకులు కావచ్చు

నని తోచినప్పుడు ప్రజలయభిప్రాయము తమకడ్డురాని ఆలోచనలన్నీ చేసి ప్రజలనోళ్లు మూయించవచ్చును. రుష్యాయంతటి పూర్ణ ప్రజాప్రభుత్వాలు జర్మనీచీనాలు అయినా కాకపోయినా హిట్లరు షియాంగ్ కేషెక్కుల చరిత్రలు ఈవిషయములో నిదర్శనముగా తీసికొనవచ్చును.

హిట్లరు ప్రజానిర్వాచితుడే. వర్సేయిల్సు సంధి కారణముగా జర్మనీపొందిన దురవస్థలను తుడిచివైచే పరమోత్సాహముచూపి పైకెగసినాడు. బీదల కార్మికస్వాతంత్ర్యములీయక పెట్టుబడిదారులు యూదులని బలసంతులపలుకుబడి నశింపజేయడానికి వారిని తరిమి కొట్టి, వారి జీవితములనుహరించి ఆర్థికాధికారము తాను బాచుకొనినాడు. అధ్యక్షుడుగానున్న హిండెంబర్గు చనిపోతే ఆహోదానే రద్దుచేయించి ముఖ్యమంత్రియయిన తానే ఆయధికారమును వహించినాడు. మంత్రివర్గములోని యితరులను నామకార్థముంచుకొని సర్వాధికారములు తానువహించినాడు. సర్వసైనికాధికారము తనదే చేసుకొనినాడు. ఆస్ట్రియాసందర్భమున చేసినపని యాలోచింపుడు. షూస్నిగ్గు ప్రజలయభిప్రాయము తీసికొన నేర్పరచుచుండగా తాను సైన్యాలతో ప్రవేశించి దేశమాక్రమించి వోటింగు పెట్టించి అందరూ తానుచేసినపనిని అంగీకరించినారనినాడు. జర్మనుప్రజల ఏకీభావమును పెంపొందించి బలపరచేయుద్దేశముతో 'రీఖ్'అనే ఆ దేశప్రభుత్వములో నిమిడ్చిన కొద్దిపాటి నిరంకుశత్వమును అందులో పరిపాలకవర్గానికేర్పరచిన కొద్దిపాటి ప్రత్యేకత్వపుహక్కును ఇంతనిరంకుశత్వాన్ని తానుపెంచుకోడానికి కతడు వినియోగించుకొని

ప్రపంచమునే కబళించెదననుచున్నాడు. చీనాదేశచరిత్ర యందును 'కోమింటాంగ్' నే మన కాంగ్రెసుబోటిసంస్థ సర్వాధారము కావడము మొదట సోషలిస్టుగానున్న షియాంగ్ కేషెక్కు, జపానుకు మిత్రుడు కావడానికి తరువాత నిరంకుశుడయి ప్రజలరాజ్యాన్ని ప్రజలచేతిలో పెట్టకుండా తనచేతిలోనే పెట్టుకొని చీనాలోని సోషలిస్టులను అణచి దేశబలాన్ని కృంగదీయడానికి జపాను పై బడివచ్చినప్పుడు చేసినతప్పు దిద్దుకొని గోతిలోపోవుపనికి గొడ్డటితో ప్రయత్నింపవలసిన ఆవశ్యముసంభవించడానికి — ఇన్నిటికీ దారిదీసినది.

ఇట్టియనుభవాలు లోకమునకు కలిగియున్నందుననే సర్వసన్యాసులు ప్రజాప్రభుత్వములోనే పరిపాలకులయ్యేసందర్భము కలిగినా వారుచెందిన పార్టీసంస్థగాక ప్రజలసంస్థలు — రైతుసంస్థలు కార్మికసంస్థలు వగైరాలు — ప్రచారములో ఉండడానికి సంపూర్ణావకాశాలుండవలెనని లోకమున నభిప్రాయము ప్రబలిపోయినది. ప్రభుత్వాంగనిర్ణయము చేయవలసివచ్చినప్పుడు ఇట్టిసంస్థల యభిప్రాయప్రకటన నైజరీతిని జరుగడానికి ఎన్నికల కీసంస్థలనే ప్రాతిపదికములుగా తీసికోవలసినదని కోరువారును కలరు. ఇదివరలో వర్ణితమైన 'ఇనీషియేటివు', 'రెఫరెండము' వగైరా అధికారములు రాజ్యాంగమునందు ప్రజల కేర్పడియుండి స్థానికపరిపాలన సమగ్రముగానుండి కార్మిక కర్షకాదిసంస్థల వాక్స్వాతంత్ర్య, రచనాస్వాతంత్ర్య, సమావేశస్వాతంత్ర్యములు అరికట్టబడక యున్నయెడల ఇట్టి ప్రత్యేకసంస్థలకు ప్రత్యేకప్రాతినిధ్యము ప్రసాదితము

కానున్నను నష్టముండదను వాద మాలోచింపదగినదే. కాని కుశలుడగు మానవుడు మహాజనోత్సాహమును తనవైపు త్రిప్పుకోగలడను అవిశ్వాసము ప్రజలను అశక్తానభిజ్ఞులుగా నుంచినంతకాలము తప్పదు. అందుచేతనే అంతటను పంచాయతీపరిపాలననే యేర్పరచినా దానికి బునాది ప్రజలేకాక వారి మాతృభాషయు కావలసినదని గట్టి యభిప్రాయ మేర్పడియున్నది. రష్యాలోను భాషాధారకరాష్ట్రము లేర్పరచియున్నారు. మన కాంగ్రెసు మహాసభవారు దేశభాషాధారకరాష్ట్రాలను కాంగ్రెసు కార్యక్రమమునకు అంగీకరించియున్నారు. ఆంధ్రోద్యమమునకు, ఆంధ్రరాష్ట్రవాంఛకు గూడ మనరక్తములో నిమిడియుండు నుత్సాహమునకు కారణమును ఇదే. రాజ్యాంగనిర్వహణము నేడు కాంగ్రెసువారి హస్తగతమయినది కాబట్టి నేటినుండే పంచాయతిపరిపాలన, భాషాధారకరాష్ట్రనిర్మాణము వీరు సాధింపవలెను. సాధింపగలరని దేశ మెదురుచూచును. ఇంతేకాదు. కార్మిక, కర్షకాది ఉద్యమములను సరియైనరీతిని ప్రోత్సహించి సార్వజనికవిద్యను అచిరకాలమున సాధించి ఈ యెల్ల బలమును సంపూర్ణస్వాతంత్ర్యసంపాదనకు సమకూర్చుకొనడమే గాక ముందుకు నిరంకుశత్వము ప్రబలకుండ నిరోధించుటకును తోడ్పడుదురనియు ప్రజ లాశింతురు.

ఎంత జాగ్రత్తతో మెలగినను యంత్రయుగప్రభావముచేత మహానగరములలో కోట్లకొలది వస్తువుల నొక నమూనా మేరకు ఉత్పత్తిచేసికొనవలసిన దురదృష్టమును మహాయుద్ధముల విపత్తునకు సిద్ధమయియుండ వలసిన

దురదృష్టమును, మహాయుద్ధముల విపత్తునకు సిద్ధమయి యుండ వ్రాసిన దుర్దినమును రష్యాకు తప్పనందున స్టాలినుబోటివానికి గూడ ఏకాధిపత్యదుష్కీర్తి సంభవించినది. లోకమునందు యంత్రయుగముపై కల్గిన జుగుప్స కొలది ఆయుగప్రాబల్యము తిరిగి గృహపరిశ్రమ లెక్కువగా నాధారపరచుకొని శాంతిజీవనము నడుపు కొను దినములు లోకమునకు కలిగినప్పుడు సోవియెట్టు లేదా పంచాయతిరాజ్యములో నిరంకుశుడు లేక దాసుడు లేక అందరును సమానులుగా ప్రజోపయోగ కార్యకరణదక్షులుగా సుఖపడగలరు. మన భారతభూమికిగల మితజీవనదృష్టి, అహింస, సత్యాన్వేషణపరత్వము, వీనితో మనమును ఈ పరిణామమునకు తోడ్పడవలసియున్నది. తోడ్పడగలము.

---

## ౬

# శాసనవివరణస్వరూపము

(న్యాయ విచారణ శాఖ)

భాషయొక్క స్వభావము ననుసరించియే శాసన వివరణ మవసరమగుచున్నదని ఇదివరలో వ్రాయబడి యెను. సంఘముయొక్క స్వభావమును ఇందునకు అనుకూలమగుచున్నది. మానవుడు మానవుడుగా నున్నంత కాలము స్వార్థపరత్వము పూర్ణముగా భువిని వీడి చనునటకల్ల. ఉత్తమప్రకృతులలోనే స్వార్థపరత్వము కార్యకారణమగుచుండుట తప్పలేదు. అట్టి సందర్భమున

సామాన్యప్రకృతులమాట చెప్పనేల ? ఒక్కరితో నొక్కరు వివాదములుపడుట మానవులకు సహజము. లోకము నాగరకవంతముగునట్లెల్ల ఈవివాదధోరణి హెచ్చగుటయు ప్రస్తుతయుగమున కానవచ్చుచున్నది.

విభేదముల తీర్మానము

సంఘములోని ప్రజలందరును ఒక్కచోట గుమిగూడి ఆలోచించుకొని సమ్మతినిచ్చినను ఈయకున్నను మొత్తముమీద వారియందర మానాంగీకారము కలదగుటచేతనే ప్రభుత్వము అనునట్టి ప్రకృతి లోకమున ప్రత్యేకముగా నేర్పడుచున్నది. ఏర్పడినపిదప ప్రభుత్వమను పదార్థమొక్కటియు ప్రజయను పదార్థమొక్కటియునై ఈరెంటికిని విభేదములు కలుగుచున్నవి. ప్రభుత్వమునందును ప్రత్యేకవ్యక్తు లుందురు. ప్రజయందును ప్రత్యేకవ్యక్తులుందురు. ప్రభుత్వము నందుండు ఒక్కొక్క ప్రత్యేకవ్యక్తియు ప్రభుత్వముకాదు. ఆత డధికారిమాత్రమగును. ప్రజయందలి యొక్కొక్కవ్యక్తియు ప్రజకాదు. అతడు పౌరుడు మాత్రమగును. కాబట్టి నేటి సంఘజీవితమునందు అయిదువిధములైన విభేదకారణములు కలవు. ౧ మానవునకు మానవునకు గలుగునట్టివి, ౨ సంఘమునకు ప్రభుత్వమునకు కలుగునట్టివి, ౩ పౌరునకు ప్రభుత్వమునకు కలుగునట్టివి, ౪ పౌరునకు అధికారికి కలుగునట్టివి, ౫ అధికారికి అధికారికి కలుగునట్టివి.

వీనిలో సంఘమునకును ప్రభుత్వమునకును కలుగునట్టి విభేదములను ప్రజాపరిపాలితదేశములయందు ఎన్నికలలో ప్రజానుకూలముగ ప్రభుత్వమును మార్చుకొనుట

చేతను తదనుగుణశాసననిర్మాణముచేతను తీర్చుకొను చున్నారు. ప్రజాపరిపాలన పూర్ణముగాలేని దేశములయందును అంకితములైన దేశములలోను ఆయాదేశములకు తగినరీతిని ఆందోళనముసలిపి ప్రభుత్వమును ప్రజ తమదారికి దెచ్చుకొనుటకు జూచుచు సాధ్యమైనంతమట్టుకు తీర్చుకొనుచుందురు.

అధికారికి అధికారికి కలుగునట్టివిభేదములు రెండుతెరంగులు. సమానాధికారములుకలవారికి కలుగు విభేదములు ఒక తెగ. ఎక్కువయధికారికి తక్కువ యధికారికి కలుగు విభేదములు ఇంకొక తెగ. ఈరెండవ తెగకు సంబంధించిన విభేదములను మనము గమనింపనక్కరలేదు. దేశములోని యుత్తమాధికారి వరకుంగల పరంపరలో నెవ్వరేని యొక్క రీవిభేదములను సమపరచుచున్నారు. సమానాధికారము కల యధికారులవిషయముమాత్ర మాలోచింపదగినది. ప్రత్యేకము ప్రత్యేకము స్వాతంత్ర్యములు కలిగియు అమెరికాసంయుక్తరాష్ట్రములలోవలె రాష్ట్రము లనేకము లొక్క సంయుక్తరాష్ట్రముగా చేరినప్పుడు సమానాధికారుల విభేదముల మాట యాలోచనకు వచ్చును. అట్టి విభేదములు ఆరాష్ట్రముల ప్రతినిధులచే నేర్పడు శిష్టసభలో తీర్మానమగుచున్నవి.

తక్కుంగల మూడువిధములగు విభేదములను తీర్చునట్టి యధికారము నేటిదినము ఎక్కువగా ప్రభుత్వమునకే సంక్రమించి యున్నది. సంక్రమించుచున్నది. పూర్వకాలమునందు—నేటి నవీననాగరకము లోకమును తన స్వాధీనము చేసికొనుటకు ముందు—మానవునకును మా

నవునకునుగల విభేదములేమి, పౌరునకు ప్రభుత్వమునకు కల విభేదములలో ననేకములేమి పంచాయతుల మూలక ముగా తీర్మానమగు చుండినవి. కాని పూర్వకాలములు మారి పరిపూర్ణ ప్రజాపరిపాలనము లేర్పడు భవిష్య త్కాలము లింకను రాకయుండు మధ్యకాలములందు చాల యెక్కువగా న్యాయవిచారణాధికారము, అనగా శాసనవివరణాధికారము, అధికారవర్గమువారి చేతుల లోనికే పోయినది. ప్రజాపరిపాలన తలసూప నారంభించిన తోడనే మరల పంచాయతులకు బలమేర్పడుట సంభవించు చున్నది. న్యాయవిచారణ క్రమక్రమముగా మరల ప్రజ లకే సంక్రమించుచున్నది. అందుచేత న్యాయవిచారణ శాఖ ఎల్లదేశములలోను బహు జాగరూకతతో నియ మించుచున్నారు. అధికారవర్గమునకు న్యాయవిచారణ శాఖ యంకితమయిపోయి ప్రజాపీడ జరుగకుండుట కెన్ని యేర్పాటులు కావింపవలయునో అన్ని యేర్పాటులును నాగ రికరాష్ట్రములు చేసికొనుచున్నవి.

## రెండుముఖ్యగుణములు

అందుచేతనే న్యాయవిచారణాధికారులు రెండు ముఖ్యగుణములు కలవారుగానుండుట యవసరమని సర్వరాష్ట్రములును అంగీకరించినవి (౧) శాసనముల జ్ఞా నము వారికి సంపూర్ణముగా నుండవలెను. ఇది సులభసా ధ్యముకాదు. (౨) వారు సంపూర్ణముగా నిష్పాక్షిక బుద్ధి కలవారుగా నుండవలెను. ప్రభుత్వమునకే వ్యతి రేకమయిన తీర్మానము చెప్పవలసివచ్చినను నిస్సంశయ

ముగా చెప్పనంతటి స్వాతంత్ర్యము కలవారుగా నుండ వలెను.

మూడుపాయములు

ఇట్టివారిని సంపాదించుటకు నాగరకరాష్ట్రములు మూడుపాయముల నవలంబించియున్నవి. మొదటి యుపాయము వారిని నియమించుపద్ధతికి సంబంధించినది. రెండవ యుపాయము వారి యధికారమునకు సంబంధించినది. మూడవయుపాయము వారు పొందవలసిన ప్రతిఫలమునకు సంబంధించినది.

న్యాయావిచారణాధికారులను నియమించు నధికారమును శాసననిర్మాణసభలు పెట్టుకొననగునాయనిన నది యంత ఫలవంతమగునని చెప్పుటకురాదు. శాసననిర్మాణ సభయందొక్కకక్షి యెల్లప్పుడును బలవత్తమముగా నుండును. కాబట్టి న్యాయవిచారణకర్త ఏకక్షికి చేరిన వాడోయను ఆలోచన రావచ్చును. నిజముగా న్యాయ విచారణ చేయవలసినవాడు ఏకక్షికిని చేరియుండరాదు. అది యట్లుండ శాసననిర్మాణముచేయు సభయే శాసన వివరణకర్తలను నియమించుటకు, తీసివేయుటకు నధికారము కలదయినచో దాని యధికారము విపరీతము కావచ్చునని కొందఱి యభిప్రాయము. ఏవంవిధమగు నాక్షేపమే అధికారవర్గమువారు న్యాయవిచారణకర్తలను నియమింపరాదను సిద్ధాంతమునకు ఆధారమైనది. పోనిండు ప్రజాసమూహామే వీరిని నిర్వాచింపవచ్చు నందమా ? న్యాయవిచారణకర్తల కార్యము సామాన్యముగాదు.

అట్టి కార్యమున కర్హతగలవారిని నేర్పరచుభారము సహస్రశీర్షంబగు ప్రజ ధరింపగలదా ?

న్యాయవిచారకర్తలను నియమించు నధికారమును మరి నాగరికలోక మెవ్వరికి ప్రసాదించినది? ఉత్తమాధికారికి, అనగా నధికారివర్గమునకు. ఇక న్యాయవిచారణకర్తల స్వాతంత్ర్యము గతియేమియని సందియము పడవలదు. ఉత్తమాధికారికి సామాన్యముగా నియమించు నధికారము మాత్రమున్నది. తీసివేయునధికారము లేదు. జీతము తగ్గించు నధికారములేదు. సాధారణముగా మార్చునట్టి యధికారముకూడ లేదు. న్యాయవిచారణాధికారిని నియమించినతరువాత దుర్మార్గప్రవర్తకుడు కానంతకాలము న్యాయవిచారణాధికారిని తాకుటకైనను ఉత్తమాధికారికి స్వాతంత్ర్యములేదు. ఇదియే నాగరకరాష్ట్రములు అవలంబించిన రెండవయుపాయము. తన పదవినుండి తన్ను తొలగించు నధికార మెవ్వరకునులేదని తెలిసినప్పుడు మానవుడు చూపగల స్వాతంత్ర్యము మిక్కిలి యెక్కువ. ఈ యుపాయమేకాక మరియొక యుపాయమును నాగరకలోక మవలంబించినది. తగిన యాదాయములేనినాడు మానవుడు పదిరూపాయల లాభము దొరుకుననినయెడల భ్రమప్రమాదముల పాలగుట సంభవింపవచ్చును. న్యాయవిచారణకర్త లిట్టి భ్రమప్రమాదములకు లోనగుదురేని న్యాయవిచారణ యంతయు నెదురుదిరుగును. కాబట్టి లోకములోని నాగరకరాష్ట్రము లంతటను న్యాయవిచారణకర్తలకు మిక్కిలి యెక్కువ జీతములు నిర్ణీతములైయున్నవి. ఏమాత్రము

వ్యామోహమునకును ఎడమీయనియంత సౌఖ్యమునకు దగిన జీతములు వీరి కేర్పడవలయుననుట సిద్ధాంతము.

## వై ప రీ త్య ము లు

ఇంతటి యాలోచనలు చేసియు న్యాయవిచారణ కర్తలు ఇంకను కొన్ని దేశములలో పరిపూర్ణస్వాతంత్ర్యమును కనుబరచుటలేదు. ఇటాలియారాజ్యమునందు న్యాయవిచారణకర్తలను ఒకతావునుండి యొకతావునకు మార్చునట్టి యధికారము అధికారశాఖవారికి నుండుటను బట్టి అచ్చటి న్యాయవిచారణాధికర్తలు కొంతకుకొంత స్వాతంత్ర్యము గోలుపోయినవారుగ నున్నారట! ఆంగ్ల సామ్రాజ్యములోని మనదేశమునందు అధికారశాఖ వారికే న్యాయవివరణాధికారము చేతి కబ్బియున్నది. జిల్లా కలెక్టరునకును, అతనికి లోబడిన యధికారులకును న్యాయవివరణకు సంబంధించిన యధికారములు ఎక్కువ గాకలవు. అందుచేతనే అధికారవర్గమువారు తలధరించు నధికారమునకును మేరలేకయున్నది. మనదేశమునందు ప్రాంతములకు ఉత్తమన్యాయస్థానములును, జిల్లాలలో జడ్జీల విచారణయుకలదు. కాని ఉత్తమన్యాయస్థానము లోనే కొన్నిపదవులు తాత్కాలికములుగా గణించి వానికి మన గవర్నరులే తమకు తోచినవారిని నియమించుట సంభవించుచున్నది. ఈయెల్ల సందర్భములును న్యాయవిచారణాధికారుల స్వాతంత్ర్యమునకు భంగకరములు. న్యాయవిచారణకర్తలకు ముఖ్యమంత్రితో సమానమైన జీతములుకలవు. అమెరికాసంయుక్తరాష్ట్రమునందు ఉత్తమాధికారియైన యధ్యక్షునకు తరువాత

జీతముకలవాడు ఉత్తమన్యాయాధికారి. ఇతనికి జీతము ౧౫,౦౦౦ డాలర్లు (సంవత్సరమునకు) ఇతనితోడి న్యాయ విచారణకర్తలకు ,౧౪,౫౦౦. రాష్ట్రములోని ఇతరో ద్యోగులలో నెవ్వరికిని ౧౨,౦౦౦ డాలరులకు పైబడిన జీతము లేనేలేదు.

క్రొత్తగవర్నమెంటు అఫ్ ఇండియాశాసనము క్రింద మనదేశమునకు నొక యుత్తమన్యాయస్థానము నేర్పరచినారు. దీనిపేరు ఫెడరలుకోర్టు అనినారు. ఈకోర్టు జడ్జీలను ఇంగ్లండులోనుండు రాజు నియమించును. బ్రిటిషు ఇండియాలోని హైకోర్టులోగాని బ్రిటిషు ఇండి యా ప్రభుత్వముతో ఫెడరేటు చేసుకొనే (కొన్ని కార్యాలకు ఒక్కటిగాచేరుకొనే) స్వదేశసంస్థానపు హైకోర్టులోగాని ఐదుసంవత్సరాలైనను జడ్జీగానుండి యున్నవారైనను, అట్టి హైకోర్టులలో పది సంవత్స రములుగా ప్లీడరీ చేసినవారైనను, ఇంగ్లండు ఐర్లండు లలో పదేండ్లు బారిస్టరీచేసిన వారైనను స్కాట్లండులో పదేండ్లు అడ్వకేటుగా నున్నవారైనను, అయిననే తప్ప ఈ జడ్జీపదవులకు నియమితులు కారాదు. అందులో ఛీఫ్ జస్టిసుగా ఉండడానికి పదునేనేండ్ల అనుభవమును, ఇతర నియమాలును కలవు. ఈ జడ్జీలకు ౬౫ ఏండ్ల వయసు వచ్చేవరకు వీరు అధికారమునందుందురు. వీరే రాజీ నామా యిచ్చినా, లేదా దేహదౌర్బల్య మనోదౌర్బల్య ముగాని దుష్ప్రవర్తనగాని కారణముగా రాజు స్వహ స్తాక్షరిక్రింద తీసివేసినా తప్ప వీరిని పనినుంచి తొలగించు అధికారము వేరులేదు. వీరి జీతము బత్తెములు నిర్ణ

యము చేయునట్టి అధికారము రాజుది. ఒకప్పపర్యా యము నిర్ణయముచేసినపిదప నియమితుడైన జడ్జీ అధికారమునందుండగా అతనికి నష్టమగురీతిగా జీతములు బత్తెములు మార్చే అధికారము రాజుకుకూడలేదు. ఇట్టి విధానములే హైకోర్టుజడ్జీలవిషయమునందును అమలులో నున్నవి. గవర్నమెంటు అఫ్ ఇండియాఆక్టుకు సంబంధించియు దానిక్రిందచేసే ఆర్డర్సు ఇన్కౌన్సిలుకు సంబంధించియు స్వదేశసంస్థానములు ఇతరరాజ్యాంగముల బాంధవ్యములకు సంబంధించియు అసలు అధికారము ఫెడరల్ కోర్టుదే. క్రింది హైకోర్టులు ఈసంబంధములో చేయు తీర్పులపైన ఈకోర్టుకు అప్పీలుండగలదు. ఇండియా శాసనసభలవారు శాసనముచేసి హైకోర్టులమీద సివిలు కేసులలో ఫెడరలుకోర్టును అప్పీలుకోర్టుగా నిర్ణయించవచ్చును. ప్రీవికౌన్సిలుకు అప్పీళ్ళట్టి సందర్భాలలో పోకూడదని నియమింపవచ్చును. గవర్నమెంటు అఫ్ ఇండియా ఆక్టుక్రింద ఆర్డర్సు ఇన్కౌన్సిలు స్వదేశసంస్థానముల ఇన్స్ట్రుమెంటు అఫ్ అక్సెషనుక్రింద అసలు వ్యాజ్యములు ఫెడరలుకోర్టులో వేసినప్పుడు ప్రీవికౌన్సిలుకు అప్పీళ్లుండును. ఇతర కేసులలో ఫెడరలు కోర్టువారియొక్కగాని, గాని ప్రీవికౌన్సిలువారియొక్క అనుమతిపొందిననే అప్పీలు పెట్టవచ్చును. ఇండియను శాసనసభలు తీర్మానముచేసిన సందర్భాలలో అప్పీలుండదనుట స్పష్టము.

**రెండు ముఖ్యాంగములు**

న్యాయవిచారణశాఖయందు రెండు ముఖ్యాంగములు గమనింపదగినవి. వానిని ౧ కోర్టులు ౨ పంచాయ

తులు అని యనవచ్చును.

## కోర్టులు

కోర్టులు సాధారణముగా అచ్చట విమర్శింపబడు వ్యాయోగములను బట్టి రెండుగొప్పశాఖలుగా నేర్పడి యున్నవి—సివిలు కోర్టులు, క్రిమినలు కోర్టులు. ఇది యెల్లరును దినదినమును అనుభవమున నెఱిగినసంగతియే. ఈవిభేదమునకు కారణము తెలిసికొనందగి యున్నది. మనుష్యునకు మనుష్యునకు వివాదము అనేకవిధముల కలుగవచ్చును. అప్పుతీసికొని యీయకపోయినప్పుడు వివాదము కలుగవచ్చును. భూమిపంపకము విషయము లలో కలుగవచ్చును. వ్యాపారమునందు ఎవ్వరెవ్వరికి నెంతెంతభాగము లాభము చేరవలయునను విషయమై వివాదము కలుగవచ్చును. ఆస్తియేదైనను ఎవ్వనికి చేరి నది యని నిర్ధరించుకొనుటలో వివాదము కలుగవచ్చును. వీనియందు నిర్ణయము కావలసిన విషయము రెండు పక్ష ములవారికి మాత్రము పరస్పరము సంబంధించినది. ఈ వివాదములవలన చెడినను బ్రతికినను ఆరెండు పక్షముల వారికి మాత్రమే అది యన్వయమగును. ఇందువలన సంఘమునకు కలుగునట్టి యపాయము ఏమియులేదు. మరి యింకొక విధమగు వివాదముల నాలోచింతము. ఒక నిసొత్తు నింకొక డపహరించినాడు. ఒకని యాస్తి నింకొ కడు దొంగిలినాడు. ఒకని నెత్తి నింకొకడు బద్దలు కొట్టి నాడు. పదుగురుచేరి బజారులో నల్లరిచేసినారు. ఇవియన్ని యు సంఘమున కపకారము చేయునట్టి పనులు. వీనిలో కొన్ని పరస్పరము ఇరువురకేకలుగు వివాదములైనను

వీనివలన సర్వసంఘమునకును విపత్తుగలుగుటకు అవకాశ మున్నది. కాబట్టి వివాదములు ఇట్టివిపత్తునకు నాకరమైనవి, యిట్టి విపత్తునకు ఆకరముకానివి యని రెండు తెగలుగా నేర్పడియున్నవి. ఈరెండు తెగల వివాదములను తీర్చు కోర్టులకు క్రిమినలుకోర్టులు, సివిలుకోర్టులు అనువ్యవహారము కలిగినది.

### గోపురాకారము

ఈరెండు తెగల కోర్టులును సామాన్యముగా గోపురాకారముగా క్రిందినుండిపైకి అంతస్థులు అంతస్థులుగా నియమితములైయున్నవి. మరీ చిన్నవ్యవహారములను సివిలుక్రిమినలు రెంటిని విచారించు గ్రామన్యాయస్థానములు ఈరెండుగోపురములకు బునాది. అందుపైన నొక్కగోపురమున మునసబుకోర్టులు, సబుకోర్టులు, జిల్లాకోర్టులు, హైకోర్టు, ఫెడరలుకోర్టు, ప్రీవికౌన్సిలు ఈ రీతిని నంతస్థులు కలవు. అదేవిధముగా క్రిమినలు గోపురమున మేజిస్ట్రేటుకోర్టులు,—అందులో తరగతులవారి —జిల్లాకలెక్టరు, జిల్లాజడ్జీ, హైకోర్టుమున్నగు నంతస్థులున్నవి. ఇతర దేశములందును నేవంవిధమగునంతస్థులు కాననగును. క్రిందియంతస్థున ప్రారంభించి ఆయావ్యాయోగస్వభావము ననుసరించి శిఖరాగ్రమువరకును వ్యవహారములు నడుపుకొనవచ్చును. కాని వ్యవహారములు విశేషభాగము పంచాయతులయెదుట తీరిపోవునట్లేర్పరచుటే యుత్తమము. ఇతర దేశములలో పంచాయతులకు సామ్యముగల పద్ధతులుగలవు. వానిని జ్యూరీలనియు, మరి యితరపేళ్ళతోను వ్యవహరింతురు.

## భిన్నజాతులు

అయిన నీపద్ధతికి భేదము లేనేలేదనుకొనరాదు. కోర్టులలోను అనేకవిధములయిన భిన్నజాతులేర్పడి యున్నవి. ఈ భిన్నజాతులలో ముఖ్యతమమయినది అధికారులుచేయు దోషములను విచారించు న్యాయస్థానము. ఇట్టి జాతికోర్టులు ఆంగ్లభూమిలో లేవు. కాబట్టి మనభూమికిని ప్రాకలేదు. దోషస్థుడు ముఖ్యమంత్రికానిండు, సామాన్యుడగు కనిస్టేబిలుకానిండు ఎంతటి యధికారియైనను ఆంగ్లసీమలో సామాన్యప్రజలకు ఏన్యాయస్థానము లేర్పడియున్నవో ఆన్యాయస్థానములలో విచారణ నందితీరవలెను. తనకు ప్రత్యేకము న్యాయాధికారి కావలయునని కోరుటకురాదు. ఈకారణముచేతనే 'బ్రిటిషు న్యాయవిచారణ' యనిన నుత్తమోత్తమమని లోకమున పేరుపడియున్నది. అందువలననే మన దేశములో న్యాయవిచారణయందక్రమములు జరిగినప్పుడు మననాయకులు 'బ్రిటిషున్యాయము' పేరు చెరుపవలదని అధికారులకు హెచ్చరిక చేయుచుందురు. "నేను తెల్లవాడను, నాజేసినతప్పులు విచారింప తెల్లవాడేతగినవాడు. కాబట్టి నన్ను సామాన్య న్యాయస్థానమునకు గొనిపోవలదు" అని ఒక్కజాతివారు కోరు నేర్పాటు సరికాదని ఖండించుచుందురు. అదియట్లుండనిండు. ఐరోపాఖండములోని నాగరక దేశములలో అనేక దేశములందు ఆంగ్లభూమిలోవలె గాక అధికారుల తప్పులనువిమర్శించు కోర్టులు వేరుగా నేర్పడియున్నవి. ప్రభుత్వాధికారులను సామాన్యజనులవలె నెంచి సామాన్యజనులవలె విమర్శకు భాజనులను చేసినయెడల ప్రభుత్వము

నెడ లోకులకు మదింపు చెడునను సిద్ధాంతమె ఈకోర్టుల యునికికి మూలాధారము. ఈసిద్ధాంతము తప్పనుట స్వయంప్రకాశము. అయినను ప్రత్యేకము కోర్టులు నేటికి రేపటికి నున్నవనుట నిజము. కోర్టులజాతులు ఇతరవిధములై నవిగలవు. మతవిషయకమైన కోర్టులు సాధారణముగా పాశ్చాత్యదేశము లన్నిటను గలవు. సైనికవిషయక దోషములను పరీక్షించు కోర్టులు సైనికాధికారులతో జేరినవి యెల్లయెడలను నున్నవి. వ్యాపారవాణిజ్యములు వ్యాపించి ప్రత్యేకమగు సాంకేతికవ్యవహారములు పెరిగినప్పుడు వాని తీర్పునకు ప్రత్యేకన్యాయస్థానములు కొన్ని దేశములయందేర్పడియున్నవి. శిక్షను సంబంధించిన సిద్ధాంతములు మారుకొలదిని నేటిదినము పిల్లలకు ప్రత్యేకన్యాయస్థానము లేర్పడవలసి వచ్చినవి.

విపరీతములు పోద్రవుట

న్యాయవిచారణకు మిక్కిలి నున్నితమైన సాధనము లేర్పడినవి. నిజమరయగా, ప్రాచీనకాలములయందు అనేకదేశములలో ప్రజలలో అంతస్థులేర్పడి ఒకేనేరమునకు నొకొక్క యంతస్థునందలి మనుష్యునకు నొకొక్క శిక్షి దండన నియమితమై యుండినది. పాశ్చాత్యభూములలో బానిసలు ఎక్కువగా నుండువారు. యజమాని వారి నేమిచేసినను చేయవచ్చును. అతనికి శిక్షయే లేదు. భార్యలను భర్తలెంత హింసించినను దిక్కులేదు. బిడ్డలు తండ్రులసంగతియు నదేగతి. మధ్యమయుగమున నైరోపాలో మతాచార్యులు తప్పుచేసిన నొక్కదండన, సామాన్యుడు అదేతప్పు చేసిన వానికి వేరుదండన. ప్రభువు తప్పు

చేసిన నొక్కదండన. ప్రజయ దేతప్పు చేసిన నింకొకదండన. మనదేశమునందును ఇట్టిస్థితిగతు లొక్క కాలమున నుండె ననుట మనుస్మృతి ఇత్యాదులవలన దెలియుచున్నది. నేటి దిన మిట్టి విపరీతములన్నియును నశించినవి. న్యాయస్థాన మున సర్వజనులును సమానులనుట సిద్ధాంతమైనది.

ఇంతేకాదు. నేటిదినము న్యాయవిచారణపద్ధతు లును సున్నితములయినవి. ముకోణములకు కట్టి కొట్టి నేరములను నొప్పుకొనునట్లు చేయుకాలములు గతించినవి. మల్లయుద్ధములు, పిస్తోలుయుద్ధములు చేసి న్యాయమును స్థాపించు దినములు గడచినవి. అగ్నినురికి, నీటమునిగి, శాసలుచేసి తీర్మానముచేయునట్టి యుగములు మారినవి. దోషస్థుడనిన కాళ్లుకోసి, చేతులుగోసి, కఠినకారాగార ములలోత్రోసి దోషమున నాత డింకను నెక్కువగా మునిగి పగతీర్చుకొనుటకు పట్టుపట్టునట్లు చేయు కాలము లంతరించినవి. తుదకు అధికారులు ఇష్టమువచ్చినవానిని ఇష్టమువచ్చినట్లుగా పట్టి నిర్బంధించు నేర్పాటులును తగ్గు చున్నవి. మనదేశములో నింకను నెక్కువగా నీవిషయ మున సౌకర్యమేర్పడుట లేదు. ఇంకను నిచ్చట 'జనరలు వారంటు'లకు నెడమున్నది. అనగా ఊరుపేరులేక ఇట్టి నేరమనియైనను వ్రాయక న్యాయాధికారులు అధికార వర్గములోని వారిచేతికి వారంటులు వ్రాలుచేసి యిచ్చు టకు వీలున్నది. ఏసబ్ ఇనస్పెక్టరో తన యిష్టముకొలది ఈవివరములు తరువాత వ్రాసికొనవచ్చును. ఇట్టి వారం టులు ఇంగ్లండులో చెల్లవు. అంతేకాక ఇంగ్లండులో కోర్టువారికి కారణము కనుబరచక యెవ్వరిని నిర్బంధమున

నుంచుటకే లేదు. మనదేశములోను ఇట్టి యేర్పాటు లత్యావసరములని పెద్దలు కోరుచున్నారు.

ఇంతటి సున్నితములయిన సాధనములు న్యాయ విమర్శకు ఏర్పడియు, ఏర్పడుచుండియుగూడ కోర్టులలో న్యాయమే జరుగుటలేదనువార్త లోకమంతటను మెండైనది.

ఇందుకు కారణ మరయవలయును. న్యాయవిచారణకు ముఖ్యాధారము సాక్ష్యము. స్థానమువదలిపోయిన సాక్ష్యము మాఱిపోవును. స్థానికులకు సమాచారములు తెలిసినంత బాగుగ తదితరులకు తెలియవు. అంతియగాక స్థానికుడుగా నుండువాడు అదేస్థానమున నబద్ధములాడి యొరునకు చెరుపుచేసి కాలుదన్ని నిలుచుట కష్టము. అదియుంగాక తమతమ ప్రదేశములలో న్యాయమే జరిగితీరవలయుననుట తత్తత్ప్రదేశజులకు పట్టుదలగానుండును. ఏలయన, సర్వజనులు సుఖముగా నుండుటకు అక్రమములు జరుగకుండుటయు, జరిగినప్పుడు అక్రమపరుడు శిక్షితుడగుటయు నత్యావసరము. అట్లు జరుగక అక్రమమే న్యాయస్వరూపముదాల్చి దంభముగా తిరుగ నారంభించునేని లేనిపోని కలతలు కలిగి కష్టములుతోచి యొక్కరిపై నొక్కరికి విశ్వాసము లేక యునికియే దుర్భరమగును. కాబట్టి యెల్లప్పుడు నలుగురుస్థానికులు న్యాయముచెప్ప నర్హులనుట ఉత్తమనాగరకరాష్ట్రములలో నంగీకృతమయినది. పరస్పరసహాయసానుభూతులే జీవితమునకు బునాదులైన యీభారతభూమిలో ననాదిగా పంచాయితికి ప్రబలాధికార మీయబడినది. బ్రిటీషుకోర్టు లేర్పడు

వరకు పంచాయతులే మనకు పరమాధారములుగానుండి నవి. ఎల్లవిషయములకు పంచాయతులే. న్యాయవిచార ణకు పంచాయతులు. మతవివాదవిచారణకు పంచాయ తులు. కోర్టులకు కొల్ల బెట్టు కొరసూలినతనము పెరిగిన తరువాత పంచాయతులపేరు అదృశ్యమైనది. ఒక్కమతా చారవిషయములకుమాత్రము—ఉత్తమజాతులు బీడు వడగా—తక్కువజాతులవారు ఈపంచాయతులను ప్రచా రమున నుండనిచ్చినారు. ఇప్పటికి బహుకాలముగా మన దేశస్థులు కోర్టులమూలకముగానందిన మహారిష్టములు దిలకించి ప్రభుత్వమువారు మరల పంచాయతులను ప్రచా రములోనికి దెచ్చుట కేర్పరచుచున్నారు. సంతోషము.

ఆంగ్లభూమిలో బహుశతముగా వ్యాప్తియం దుండునట్టియు, మన దేశమునందును కొంచెముగా నవలం బింప బడినట్టియు 'జ్యూరి' (అసెసరుతో సహా) పద్ధతి యీ పంచాయతిపద్ధతికి సహోదరము. ఇంగ్లండులో నేటికిని న్యాయవిచారకర్తలు ఆయా ప్రాంతములలో సమావేశ మయి ఆయాప్రాంతముల ప్రజలలోనుండి పండ్రెండు మంది "జ్యూరరు" లను సివిలు క్రిమినలు వ్యాజ్యెము లన్నిటను నేర్పరచి తీర్మానములను జేయుచున్నారు. పం డ్రెండుమందిలో ఒక్కడువిభేదపడినను ప్రతివాది నిరప రాధియే. బ్రిటిషుపౌరుడు తనసోదరులు పండ్రెండుగురు తన్ను విచారింపనర్హులుగాని తదితరు లర్హులుగారని ఘంటాపథముగ జెప్పుకొనుచున్నాడు.

ఈయాచారము ననుసరించి మన దేశములో 'జ్యూ రరు' లను 'అసెసరు'లను ఏర్పరచుచున్నారు. కాని వీర

లకు ఇంగ్లండులోని జ్యూరరులకు నున్న యధికారము గాని అవకాశములుగాని లేవు. ఇచ్చట "జ్యూరరు" లున్నచోటికి న్యాయవిచారణకర్త లేగుటలేదు. న్యాయస్థానములున్నచోట "జ్యూరరు" లేర్పడుచున్నారు. సివిలు వ్యాజ్యములలో జ్యూరరుల కధికారములేదు. క్రిమినలులలో మాత్రము, అదియు ఎక్కువమైన నేరములకే, ఈసంస్థ లుపయోగపడుచున్నవి. ఒక్క 'జ్యూరరు' విభేదపడి నప్పు డిచ్చట ప్రతివాది సంరక్షితు డగుటలేదు.

పంచాయతులకును "జ్యూరీ" లకును ఇంత ప్రాముఖ్యము కలుగుటకు మరియొక్క కారణమును కలదు. ఒక్కని యాలోచనకంటె పదుగురయాలోచన న్యాయపక్షముగా నుండును. ఈయర్థమును బురస్కరించుకొనియే కొన్నికొన్ని సందర్భములలో న్యాయాధికారులు ఒంటిగా కూర్చొని సంగతులను విచారింపక న్యాయస్థానములో కలవారిరువు రిరువురుగానో, మువ్వురు మువ్వురుగానో, అవసరమగు నెడల అందరును ఏకముగానో కూర్చొని వ్యాయోగములను వినుచున్నారు. మన యుత్తమన్యాయస్థానముల పద్ధతుల నెరింగిన వారలకు ఈసంగతులన్నియు కరతలామలకములే.





ఆంధ్రభూమి ముద్రణాలయము — వేపేరి, మదరాసు.

